శ్రీ

# సంపూర్ణరామాయణము.

ఇది

వైద్యరత్న గూడూరు వెంకటశివకవీంద్రపుత్రులగు

గూడూరు కోటీశ్వరశాస్త్రిచే

రచియింపబడియె.

రెండవకూర్పు : 1000.

పబ్లిషరు:

పోలిశెట్టి రామయ్య,

ప్రొప్రయిటరు,

శ్రీ సీతారామాంజనేయ కంపెనీ,

బుక్కుసెల్లర్సు, బెజవాడ.

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, లిమిటెడ్, బెజవాడ.

1922

 [వెల రు 1-0.

శ్రీ

# పీఠిక

## ప్రథమముద్రణము.

ఉ॥ మానక కర్మభూమిపయి మానుష దేహములో హితాహిత
జ్ఞానమెఱుంగు బ్రాహ్మణుఁడు నాటకవిద్యను నేర్చి జానకీ
జానికథల్ రచింపకిరు సత్కృతులెన్ని రచించెనేనియున్
వాని వివేకమేమిటికి వాని కవిత్వ మహత్త్వమేటికిన్॥

బుధసత్తములారా!

తొలుత నేను పద్మినీలోకబాంధవమను నొకచిన్న నాటకమును 1916 సం॥న రచించితినిగాని దానిని ముద్రింప ప్రయత్నింపనైతిని. ఇట్లు కొంతకాలము గడచెను. పదపడి మఱొక నాటకము వ్రాయ నుత్సాహముపొడమ యెద్ది వ్రాసిన పూజనీయమై, సర్వజనాదరణీయమై, సర్వపాపక్షయమై, విలసిల్లునా యని మనమున దలపోసి తలపోసి, ఎట్టకేలకు శ్రీరామచారిత్రకన్న మించిన చారిత్రలేదని యోచించి రామాయణమంతయు నొకరేయి ప్రదర్శింప ననుకూలించునట్లు, "సంపూర్ణ రామాయణము" అను పేర వ్రాసినాడ.

మ॥ ... ... ... ... ... ... ... ...
... ... ... ... ... ... ... ...
......................ప్రాజ్ఞులారా నిరసింపంబోకుఁడీ రాఘవే
శ్వరుచారిత్రము నెందఱెన్ని గతుల వర్ణించినం గ్రాలెడి॥

అను ప్రామాణికముగా నెందఱెన్ని విధముల రచించినను ననువదీకరణీయగుటచే శ్రీరామ చరిత్రకు మించు దివ్యచారిత్రములేదనియు మనమున నిశ్చయించి 1919 సం॥న వ్రాసియుంటిని. అప్పటి నుండియు కాగితముల ధర అధికమగుట ముద్రింప ప్రయత్నించినను నాయత్నము సాగమిచే నిరుత్సాహుండ నైతి. నేటికి విజయవాడపురవరమ్మున నెలకొల్పిన శ్రీ సీతారామాంజనేయ కంపెనీ వారు దయచే ముద్రించి ప్రచురించెదమన సంతసించి యీ గ్రంథమునకుగల సర్వస్వాతంత్ర్యములు వారికి రిజప్టరు చేసి యిచ్చితిని. ఇయ్యది నవీనరచన యగుటచే యీ గ్రంథమునం దనేకలోపములుండియే యుండవచ్చును. "చెఱకునకు వంకపోయిన చెఱకు చేదౌనె" యన్నట్లు నాభక్తి భావమున వ్రాసిన యీ చారిత్రమున దోషములున్నను శ్రీరామనామమే భరించు గాక, యని నమ్మియుంటి. అయిన పండితాగ్రేసరులు దయతో నా తప్పులను దెలిపిన పునర్ముద్రణమున సవరించుకొనుట కెంతయు భవద్దాసుని ప్రార్థన.

గ్రంథ విస్తరభీతిచే మధ్యమధ్య కొన్నికొన్ని భాగములు విడిచి ముఖ్యపాత్రయగు శ్రీరాముని చారిత్రమునే విపులముగ వ్రాసియుంటి. అందులకై పాఠకులు మన్నింప వేడుచున్నాడ.

మఱియు నింకలి పాటలు చాలభాగము ఏకతాళము నందునే రచియించి యుంటిని. పాఠకులు వారివారి చిత్తానుసారముగ రాగతాళముల మార్చుకొని పాడుకొనవచ్చును.

భవద్దయచే చిరకాలమున కీగ్రంథము నాంధ్రలోకమునకు సమర్పించునట్టి భాగ్యమబ్బుటచే మితిలేని యానంద మందుచుంటిని.

తగినంత సత్వరముగ అస్మద్విరచిత పద్మినీలోక బాంధవము, పురూరవయను మాతన నాటకద్వయములు ముద్రణమై భవత్సాన్నిధ్యమునకు రాగలవని తెలుపుట కెంతయు సంతసించుచున్నాడను.

ఈ నాటకము నా యెఱింగినంతవరకు ప్రదర్శనార్హముగనే వ్రాసినాడను. ప్రదర్శకు లిందలి భాగముల విడనాడకయు నన్యవికృతుల జేర్పకయు ప్రదర్శింతురుగాక యని ప్రార్థన.

ఇట్లు,

గ్రంథకర్త.

శ్రీ

# ద్వితీయముద్రణము.

సోదరులారా!

అస్మద్విరచిత సంపూర్ణరామాయణము, ద్వితీయముద్రణము శీఘ్రకాలములోనే ముద్రణమైనందులకు భాషాభిమానులగు తమయభిమానమునకు నేనెంతయు సంతసించితి. వందనమాచరించుచున్నాడ. ప్రథమముద్రణమునందుఁజూపిన మీయభిమాన మీద్వితీయముద్రణమునందుఁగూడ జూప వేడుచున్నాఁడను. ఈ ముద్రణమునందు వెనుకటికన్న కొన్నిమార్పు లక్కడక్కడఁజేసి సవరించి ముద్రించినారము. ఇఁకను లోపములున్న దయతో నాకుఁజెప్పిన "తృతీయముద్రణము" న సవరించుకొందుననిక భాగ్రిహణపారీణులగు పండితోత్తములకెల్లరకు వందనమాచరించి విన్నవించుకొనుచున్నాఁడను.

పాఠకులగునో సోదరులారా!

నేనిదివరలో "పురూరవ" యను నాటకము ముద్రణలోనున్నదని దెలిపియుంటిని. నేటికి పురూరవ, మారుతీవిజయము, అను నాటకములు ముద్రణమయి సిద్ధముగనున్నవి. చదువరులు నా గ్రంథములఁగూడఁ దిలకింప వేడుచున్నాఁడను.

వేజండ్ల,
గుంటూరు జిల్లా.

ఇట్లు,
మీ విధేయుఁడు,
గూడూరు కోటీశ్వరరావు.

---

## పండితాభిప్రాయములు.

గుంటూరునుండి, రివిన్యూ ఇన్స్పెక్టరు బ్రహ్మశ్రీ భువనగిరి విజయరామశాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు.

మ॥ సరసోక్తిన్ రఘురాము వృత్తమిటఁ • సంపూర్ణరామాయణం
బనగా సర్వరస ప్రపూర్ణముగ దృ • శ్య శ్రీ నొసఁగన్ మహా
ఘనుఁడై సత్కృపిఁజేయ; యశంబుగను నీ • గూడూరు కోటీశ్వరుం
డనఘా శంకర తత్కృతిన్ మనుప్రమ • హ్యాపాతకప్రీతిమై॥

సిద్ధిపల్లినుండి బ్ర॥ వెంటు లక్ష్మీకాంతశాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు.

మ॥ సరస శ్రీరఘురాము సచ్చరితము • న్సంపూర్ణ రామాయణా
ఖ్యాతిహిన్ నాటకమెప్ప వ్రాసె సుమనో • హారమ్ము బాల్యమ్మునన్
గరుణక్షుం డురుకోశదుం డనఁగ నీ • గూడూరు కోటీశ్వరుం
డరలీలాశంకర దీనపాతకుల శ్రీ • రాయమ్మయముల్ చెంచవే॥

# అచ్చాంధ్ర నిరోష్ఠ్య సీసము.

శ్రీ.

సీ॥ రాకాసిదండుల । దేఁకువఁ దెగటార్చి
జడదారి జన్నానఁ । జాలినిల్చి
రట్టడిఁ దొలగించి । రాతి నాతిగఁజేసి
నెలదారి సింగాణి । నేలగూల్చి
నేలకూతుఁగ్గొని । చాలదొసంగొంది
అడవుల నడవిడి । దుసులఁ దేరని
జేరికఁ జల్లుఁగా । నీరైన తలలవా
నిన్గూల్చి సైదోడు । నేతఁజేసి
తే॥ గీ॥ కోతులందఱు కొండాడఁ । గొరఁత లేక
నేగుదెంచి యయోధ్య పై । డేత్త్రఅంగ
నేలు చిలుగన్నకూతును । నేలినట్టి
దశరథుని కొడుకును నెదఁ । దలఁతు దలఁతు॥

శ్రీ

# ఇందువచ్చు పాత్రలు



| పురుషులు. | అంకము. |
|---|---|
| విష్ణువు | 1 |
| దశరథుడు | 1, 2, 6 |
| సుమంత్రుడు | 1, 2 |
| వశిష్ఠుడు | 1, 2, 3, 6 |
| సేవకుడు | 1, 2 |
| విశ్వామిత్రుడు | 1, 6 |
| రాముడు | 1,2,3,4,5,6 |
| లక్ష్మణుడు | 1,2,3,4,5,6 |
| మారీచుడు | 1 |
| సుబాహుడు | 1 |
| జనకచక్రవర్తి | 1 |
| మంత్రి | 1 |
| కొందరురాజులు, మునులు | 1, 2 |
| పరశురాముడు | 1 |
| భరతుడు, శత్రుఘ్నుడు, | 3, 6 |
| పురజనులు | 3, 6 |
| మాయామృగము | 3 |
| రావణుడు | 3, 5, 6 |
| జటాయువు | 3 |
| హనుమంతుడు | 4, 5, 6 |
| సుగ్రీవుడు | 4, 6 |
| వాలి | 4 |
| అంగదుడు | 4, 6 |
| జాంబవంతుడు | 4, 6 |
| సుషేణుడు | 4, 6 |
| గజుడు | 4 |
| గవాక్షుడు | 4 |
| సంపాతి | 4 |

| పురుషులు. | అంకము. |
|---|---|
| అక్షయుడు | 5 |
| ఇంద్రజిత్తు | 5, 6 |
| విభీషణుడు | 6 |
| అగ్నిదేవుడు | 6 |
| బ్రహ్మ | 1, 6 |
| శివుడు | 6 |
| ఇంద్రుడు | 1, 6 |
| నారదుడు | 1 |
| గౌతముడు | 1 |
| శతానందుడు | 1 |

| స్త్రీలు. | అంకము. |
|---|---|
| సీత | 1,2,3,4,5,6 |
| కౌసల్య | 2, 3 |
| కైక | 2, 3 |
| సుమిత్ర | 2, 3 |
| సుందర | 2 |
| లంకిణి | 5 |
| అహల్య | 1 |
| మండోదరి | 5 |
| తాటకి | 1 |
| ఏకజట | 5 |
| హావిర్దట | 5 |
| త్రిజట | 5 |
| శూర్పణఖ | 3 |

శ్రీ ర స్తు.

# సంపూర్ణ రామాయణము.

---

శా॥ శ్రీకల్యాణగుణాభిరాముఁడు ధరి ● త్రీజామనోహారుఁ డా
రాకాచంద్రముఖుండు భానుకులా ● గ్రశ్రేష్ఠుఁ డధ్యాత్మత
స్తోకస్ఫూర్తి యశోవిశాలుఁ డఘనా ● శుండభృగాగ్రుండు బల్
దీకక్రోచుల శ్రీరఘూత్తముఁడు నే ● వేగక సభాస్థారులన్॥

## సూత్రధారుడు ప్రవేశము.

శ్రీరామకథాగౌరవముచేతనేకదా నేటి ప్రదర్శనమునకు ప్రేక్షకులు లెంకోపలంకలుగా దయచేసియుండిరి. ఆహా! యేమి శ్రీరామనామమహిమ! సర్వపాప హరంబనియు సర్వజన సముదాయమునకు హర్ష ప్రదాయకమనియు వాదుకొను నార్యవాక్యములు నేటికి నాకు దార్కాణమయ్యె. ఇంక నాప్రియురాలి నిందు రావించి నేటిఖేలనమునుగూర్చి ముచ్చటించెద. (తెరవంకజూచి) ప్రియసఖీ, నటీ! నీవొక్కసారి యిటురమ్ము.

నటి—(ప్రవేశము) ఆర్యపుత్రా! వందనము.
సూత్ర—దీర్ఘసుమంగళీభవ.
నటి—నేడేల యీజనసముదాయ సమావేశము?
సూత్ర—సమావేశకారణము నీవెరుంగవా?
నటి—ఎఱిఁగియున్న నడుగ బనియేమి?
సూ—నేడొక నవీననాటకరాజము ప్రదర్శించెదమని మనపురమెల్లగలయఁ జాటించియుంటిమిగదా.
న—అవును. ఆర్యా! నేడు ప్రదర్శించు నాటకమెయ్యది?
సూ—ఇంకను ప్రదర్శించు నాటకమే యెఱుఁగకుంటివా? సంపూర్ణరామాయణము
న—సంపూర్ణరామాయణమా! ఆహా! యేమి మీధైర్యము! రామాయణమంతయు నొక్కరేయి ప్రదర్శింప మనకు సాధ్యమా?
సూ—చెలీ! మనకు పరమమిత్రులగు నొకకవి శ్రీరామచరిత్రమంతయు నొక్కరేయి ప్రదర్శింపననువుగా వ్రాసి మనకొసంగి యుండునది నీవెరుంగవే!
న—ఆర్యా! నామధేయముం దెలుపకయే చిరమిత్రులన్నట్లు?
సూ—కొందరికొలల క్రిందట మనకు నవీనశృంగారనాటకమొకండు వ్రాసి యొసఁగియుండె. ఇప్పుడైనను తెలిసినదా?
న—ఇంకను స్ఫురింపలేదు. కవినామధేయముం దెలుపఁ బ్రార్థించుచున్నదాన.
సూ— అటులైన నిటువినుము.

సీ॥ వసుధ భారద్వాజ ● వరగోత్రజుఁడును బోధాయనసూత్రుండు ● ధన్యతముఁడు
గూడూరుకులమణి ● గుణగణశ్రేష్ఠుఁడా వెంకటశివకవి ● పెద్దసుతుఁడు

పద్మినీపతిలోక • బాంధవు పేండిలి వ్రాసియుండెను జాల • వన్నెమీర
రామాయణంబంత • రసికులు మెచ్చగా నాటకంబుగ వ్రాసి • నాడు గాన

తే॥ గీ॥ నగియ సంపూర్ణరామాయ • ణాఖ్య దీని
ఖేలనము జేయ మనకిచ్చె • లాలితముగ
నతివ గూడూరు కోటీశ్వ • రాఖ్యుడనగ
నున్నవాడు ఇలపేరును • గొన్నవాడు॥

నటి—ఆర్యా! కోటీశ్వరరావు వ్రాసినదేనా? యీ సంపూర్ణరామాయణము

సూ—చెలీ! యేమి. యింత తేలికగా బల్కెదవు.

నటి—ఈ చిరుతడు గవించిన రామాయణము మనసభికులకు రుచించువాయని యిట్లు బల్కితిగాని వేరొండు గాదు.

సూ—అరియా! కవి పిన్నయైన నేమి?

క॥ రామకథ పాపనాశము । రాముని దలచినను పుణ్య • రాశి లభించున్
రాముని మదిలో దలపని । పామరు డీలోకమందు • బాములబొందున్॥

కవిపిన్నయైననేమి, పెద్దయైననేమి? రామకథ సర్వజనాదరణీయము. ప్రేయసీ! కాలహరణమైనందులకు మనసభికులు మనపై గినియుచుండిరి. ఇకమీద కర్తవ్యమాచరింతము సర్వజన సంతోషదాయకమగు వసంతమును గురించి కొంచెము వర్ణించుము. పోదము.

నటి—చిత్తము. అటులనే వర్ణించెద.

ఉ॥ మారుని రాకగన్గొని య • మందమతిన్ శుకముల్ చెలంగగా
దీరుగ నిల్చి బర్హితతి • తీగలం గుల్కుచు నాట్యమాడగా
గోరిక దీర దుమ్మెదలు • సుస్తుతు లెత్తి రుతంబులు సేయగా
మీరి వసంతకాలమున • మేల్మి జరింతురు స్త్రీలు, పూరుషుల్॥

సూ—ఆహా! యేమి యీ వసంతఋతువర్ణనము! శ్రవణానందముగానున్నది.

గీ॥ బోటినీపాట వినుటచే • నాటకంబు
మాటమరచితి క్షీరాబ్ధి • మాధవుండు
వనజభవముఖ్య నిర్జర • వరులకెల్ల
నభయదానంబొసంగెడు • నంబుజాక్షి॥

న—అటులనా! నేత్రోత్సవముగా జూతమురండు.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





శ్రీ



# సంపూర్ణ రామాయణము.



## ప్రథమాంకము

### ప్రథమరంగము.

(ఇంద్రుడు, బ్రహ్మ, నారదుడు, గౌతముడు, కణ్వుడు ప్రవేశము.)

అందరు— కీర్తన. బేగడ రాగము - ఏకతాళము.

కమలా - లోలా - కలుషహరా

కమలముఖా - కరివరదా

శ్రీ; శా; కా; ప్రా;

రక్కసిబాధలు - మొక్కనలయ్యెన్ । నిక్కము మేమిక నిలువగజాలము

నా; రా; య; ణా; మమ్ములజూచి । మముపడిగాచి । సమ్మతిదీర్చి । మమ్ములబ్రోచి ।

కష్టముదొలగన్ । యిష్టముసాగన్ । క్రతువులు జరుగన్ । ఘనతన్ వెలుగన్ ॥ కమలా ॥

(శేషశయ్యపై విష్ణువు లక్ష్మీసమేతుడై కన్పట్టును.)

విష్ణు—సురలారా! మీకు కుశలమే.

ఇంద్రు— సీ॥ కుశలముండిన మాకు । వసుమతీనాథ ని
న్నాసించు టేల మే । మంబుజాక్ష

విష్ణు— వివిధయాగముల ని । ర్విఘ్నముగా నెర
వేర్చుచున్నారలే । విమలచరిత

గౌత— రక్కసిపిండులు । పెక్కువిఘ్నంబులు
నెరపుచున్నారు । లసురవైరి

విష్ణు— యేమి యిక్కట్టుల । పెట్టుల గల్గెనో
క్రమముగా నెరిగింపు । డమరులార

కణ్వ— క్రతువులు వ్రతము లే । మతిముదంబున సేయ
దలచిన ఫలములు । దక్కవయ్యె

విష్ణు— యింతటికార్యము । లేనీచుడొనరించె
చయ్యన దెల్పుడీ । సంయమీంద్రులార!

ఇంద్రు— మాయకుల్ రావణ । మారీచులిరువురు
సేయు దుండగములు । చెప్పగలమె

కణ్వ— మిమ్మునమ్మినవార । లిట్లాయి పలుపాట్లు
బడుచుండనౌనె యా । పన్నరక్ష

నార— కష్టమొందెదయొబొంది । నష్టమొందెదయొజెంది
తపియించుచుంటిమి । ధన్యచరిత

బ్రహ్మ— గీ॥ అసుర విసరంబులను దున్మి । యాగములను
సానుకూలంబు జేసిన । జాలుమాకు

విష్ణు— వనజసంభవ! పొందుమీ । వాసములకు
దారియోచింతు రక్షోవ । ధంబుకొరకు॥

నార—కమలాప్రియా! యింకను యోచించుటయే ! సరిసరి. మేము జీవించినగదా మీ యోచన.

విష్ణు—నారదా! యేమియట్లుబల్కెదవు?

ఇంద్రు—దేవా! మా నిలయముల నాశనముజేసి, మమ్ము సాధించి వేధించి చక్కముచున్న యాదుష్టుల బరిమార్చకున్న మాకీ నాశనివాసమేల? క్రతు వ్రతమ్ములేల? ఇట్టి మా బాధలు మీరు వేగమదీర్చకున్న మాకు దిక్కుగలదే!

విష్ణు—అమరులారా! యిక తొందరనొందకుడు. మీ బాధలదీర్ప నే నయోధ్యాధీశుండును, అర్కకులాధినాథుండును, నగు దశరథేశ్వరున కనుగు బుత్రుండనై రామావతారమెత్తెద. ఈలక్ష్మియు మిధిలయందు జనకునింట సీత యను పేర నాకొరకై పెరుగుచుండును. అప్పుడు మాకు సాయముగ దేవతలెల్లరు వానరులై జన్మింపవలెను. పిమ్మట దుష్టులగు రావణాది రక్కసులను బరిమార్చి మిమ్ముద్ధరింతు. ఇంక మీ డెగులు మానుడు, మీమీ నివాసంబులకుం జనుడు. మీ క్రతువుల సాగించుకొనుడు. ఇది పరమ రహస్యమని నమ్ముడు. (అదృశ్యుడగును)

అందరు— కీర్తన. హిం॥ తోడిరాగము - ఆదితాళము.

ఆనందమాయెగా! హరిగను గొనగను మాకు |
విష్ణావతర్న మేమిప్పుడు | స్పష్టముగను
గన నిప్పుడు | ఆహా | ఆనంద |
కాంచానచేలా - కంజాజలోలా |
కరిరాజపాలా |
ఓ! కేశవ | దైత్యారి | మాధవ | మా |
ప్రార్థన లాలించి | బ్రోవుము |
నా. రా. యు. ణా ॥ ఆ॥

(నిష్క్రమింతురు.)

(అవనిక జారును.)



## ద్వితీయరంగము.



అయోధ్యలో దశరథుని యాస్థానము.

(ప్రవేశము. దశరథుడు, వసిష్ఠుడు, సుమంత్రుడు మరికొందరు మునులు.)

దశ—ఆచార్యా! భవదీయ కరుణాకటాక్షముచే పుత్రకామేష్టిసలుప తత్ఫలంబున దివ్యసుందరవిగ్రహులును మాతాపితృ పూజాపరాయణులును దైవభక్తులును నగు బుత్రుల రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల నలువుర కౌసల్యా సుమిత్రా కైకయను దేవేరులవలన గని సంతుష్టాంతరంగుడనైతి. ఇంత దనుక వారలకువలయు విద్యాబుద్ధులజెప్పి మీరలే పెంచి పెద్దలజేసి యుంటిరి. మీద...

వసి—పార్థివా! యజ్ఞేశ్వరు కరుణచే గల్గినపుత్రులని సామాన్యులని తలంచుచుంటివి. కాదు కాదు. శ్రీరాముడు కేవలము మనుష్యరూపమునెత్తిన వైకుంఠుడుగాని వేరుగాడు. అట్టివేదవేద్యునకు వేరుగ విద్యల జెప్పువారలిలయిలంగలరే? ఆత డీభూభారముందీర్ప నిట్టియవతార మందియుండె. దుష్టశిక్షణము శిష్టరక్షణము గావించి మావటిజడదారుల నుద్ధరింపనిట్లవతరించె.

దశ—అయ్యా! మీరెరుంగని విషయంబు లెందును గానరావు. అయిన నట్లే జరుగవచ్చును. ఇపుడు శ్రీరాముని పరిణయ విషయమే విచారణీయాంశము. కావున తగురాచకన్నె యెందుగలదో? యెరింగిన నానతీయుడు.

సేవ—మహారాజా! విశ్వామిత్రులవారు హజారమున వేచియుండిరి.

దశ—ఓరీ! యా యతీంద్రుని సత్వరమునఁ దోడ్కొని రమ్ము.

సే—చిత్తము. (అని వెళ్ళును.)

(విశ్వామిత్రుఁడు ప్రవేశము)

దశ—గాధినందనా! వందనములు.

విశ్వా—పంక్తిరథా! దీర్ఘాయురస్తు.

దశ—యతికులతిలకా! ఈ యుచితాసన మలంకరింపుము.

విశ్వా—మంచిదిరాజా! నీవును గూర్చుండుము. (ఉభయులును కూర్చుందురు).

దశ— తే॥గీ॥ ఎచట నుండి మీరొచ్చుటొ ♦ కేగఁదలఁచి
ఇచ్చటికి వచ్చియుంటిరో ♦ సచ్చరిత్ర
మరియు భవదాగమనమున ♦ మద్గృహము ప
విత్రమయ్యె నాజన్మ ప ♦ విత్రమయ్యె ॥

సంయమీంద్రా! మీరు త్రిలోక సంచారులు, మీకు కెరుకబడని నూతనాంశము లుండవు. తాము విచ్చేసిన కారణమెద్దియో సెలవొసంగ వేఁడెదను.

వి—రాజేంద్రా! నేనొక కార్యముఁగోరియే వచ్చియుంటి; నద్దాని నెరవేర్చెదనంటివేని చెప్పెద.

ద—చిత్తము. మీవంటి మునిచంద్రుల కోర్కెల నెరవేర్చుటయేగదా మావంటి కుంభినీధవులకు కర్తవ్యము.

వి—రాజా నేను

ఉ॥ జన్నము సేయ, రాత్రిచర ♦ సంఘము తెస్కరిస్రుత్తిరక్తముల్
జన్నగ మాంసముల్, మధువు, ♦ బండలపై చుమి వమ్ముజేతు రా
జన్నముదీర్ప వేగమ కృ ♦ పామతి నోనృపవర్య నీసుతున్!
దిన్నగ బంపుఁడయ్య రవి ♦ తేజుని ధీరుని రామచంద్రునిన్ ॥

నేనొనర్చు యాగమునందు రక్తమాంసములు వైచుటయేగాక యాగాలయమందనేక విధములగు క్షుద్రకార్యములొనర్చి యాగభంగము గావింపఁ బ్రయత్నించుచుండిరి.

కావున ధనుర్విద్యావిశారదుండగు రాముని బంపితివేని యా దుష్టరక్కసుల నీటు గోటమీటి నాకార్యము సానుకూలము చేయఁగలఁడు. కనుక రాముని బంపఁగోరితిని. ఇంకను ధనుర్వేదమునందలి రహస్యముల గొన్ని బోధపరచెదను. మారుమాటాడక నావెంట బంపుము.

ద—గాధి నందనా !

ఉ॥ రాముని బాసి నేనెటుల • రాజ్యము సేయఁగలాఁడనయ్య శ్రీ
రామునిబాసి యెట్లు సుఖ • రంబుగనుందు నయోధ్యలోపలన్
సోముని మించు మోముగల • సుందరమూర్తిని వీడి కాలమున్
గీమున వెళ్ళబుచ్చఁగల • నే నిముసంబయినన్ మునీశ్వరా!॥

వి—దశరథా ! నీ పుత్రునకుఁ దక్క యితరులెవ్వరు నా రక్కసులఁ బరిమార్చు వారు లేరు. ఈతండు చిరుత వయస్కుఁడని మనమున దలంపవలదు. అతఁడు లోకరక్షకుండగు భగవంతుఁడేగాని మానవమాత్రుఁడుగాఁడు. లోకకంటకులగు రక్కసులఁ బరిమార్చ రామావతారము ధరించిన విష్ణుమూర్తియని యెంచి నీ మనమునంగల శంకమాని సత్వరంబునఁ బనుపుము.

దశ—(జనాంతికముగా) ఈతడు మిగులఁ గోపి. ఇపుడు రాముని బంపకున్న నాపైఁ దన కోపోద్రేకమును బరపి నన్నేమి సేయునో? (ప్రకాశముగా) మునీంద్ర చంద్రమా! యినకులోద్ధారకుండగు శ్రీరాముని బాసి నేమనఁజాలఁ; కావున నన్ననుగ్రహింపుము.

(అని పదములు పట్టుకొనును) (1. అనుబంధము).

వి—ఓయీ వశిష్ఠా! నేనెంతో నమ్రభావంబున వేడినను నీతని మనము మరలకున్నది. నీవైన మరల్చి హితోపదేశ మొనరింపుము.

వశి—(తనలో) నేనును మందలించి చూచెదను. (ప్రకా) దశరథ మహారాజా!

సీ॥ ఇక్ష్వాకుకులమణీ • యిటులనఁ బాడియె
యన్నృతంబులాడంగ • నర్హమగునె
గాధిపుత్రునిగాంచి • కడుభక్తిఁ బూజించి
యేమిగోరిననిత్తు • నేలమిగోరు
దనుచుఁ బల్కఁగ నతఁ • డా రామునిఁ గోరఁగా
మారుబల్కుట నీకు • మంచిదగునె
శస్త్రాస్త్రవిద్యల • చవియెరింగిన యట్టి
కౌశికుతో బంపు • కన్నసుతుని
తే॥ గీ॥ నీదు పుత్రుండు జన్నంబు • నెగడఁజేసి
సకలవిద్యల గ్రహియించి • సరగమరలి
రహి నయోధ్యకువచ్చి శ్రీ • రాముఁడవల
సర్వసుఖములఁ బడయు ని • స్సంశయము ॥ 4

పంక్తిరథా! శౌర్యధైర్య గాంభీర్యములయందును సంగరవిజయమందును నీ తనయుని మించువారు సురాసురులందుఁగూడ గానరాదు. నిరాయుధుఁ

త్రైనను నిశాటకోటిని బరిమార్చఁగల బాహుబలశాలి. ఇట్టి నీ తనయునికి మేలొనగూర్ప మనమునఁదలఁచి యిక్కాలశిక్షు డిచ్చటికి విచ్చేసియుండె. ఇట్టి తపశ్శాలురవెంట బాపుటకన్న వేరొండు గానబడదు. కాన శీఘ్రముగా నాశీర్వదించి పనుపుము.

దశ—చిత్తము. ఓరీ యెవడురా!

సేవ—అయ్యా.

దశ—ఓరీ అంతిపురంబునకుం జని రామలక్ష్మణులఁ దోడ్కొని రమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

(రామ లక్ష్మణుల ప్రవేశము.)

రామ-లక్ష్మ—గురువుగారా! నమస్కారము.

దశ—వశి—తనయులారా! శుభమస్తు. (2 అనుబంధము)

రాము—తండ్రీ మమ్మురావించిన కతంబేమియో సెలవొసంగ వేడుచుంటిమి.

దశ—తనయులారా! గాధేయుఁడు యాగరక్షణార్థము మిమ్ము సాయముగోరె. కాన నమ్మునివరుని యానతులోనై వారికార్యములు నిర్వహించి వారి యాశీస్సులఁ బడసిరండు.

విశ్వా—దశరథా! యిప్పటికే చాలజాగైనది. నేనేగవలయు, నీ తనయులను బనుపుము. వెళ్ళెదను.

దశ—చిత్తము. మహాస్వామీ!

తే॥ గీ॥ ఆకటికి నిద్రకోర్వని । యనుగులనక
నీ యభీష్టంబుఁదీర్ప న । మేయభక్తి
బంపుచున్నాడ నినునమ్మి । వారి నీట
ముంచెదో పాలముంచెదో, । మునివరేణ్య॥ 5

తండ్రులారా! యీ సంయమీంద్రుని వెంటఁ బోయిరండు. (3 అనుబంధము)

రామ—తండ్రీ సెలవొసంగుడు, పోయివచ్చెదము.

దశ—తండ్రులారా! యినకులోద్ధారకులని ఖ్యాతిగాంచుడు.

రామ—తండ్రీ! మీ యనుగ్రహము గలుగ మా కేవేళ నెందు నేకొరంతయు నుండనేరదు.

విశ్వా—దశరథా! నీవు నిలువుము. ఇంక తడవుసేయరాదు. పోయివచ్చెదము.

దశ—చిత్తము.

(విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు నిష్క్రమించుచున్నారు).

---

## తృతీయరంగము - అరణ్యము.

(శరములతో రాముడు, లక్ష్మణుడు, విశ్వామిత్రుడు పునఃప్రవేశము)

విశ్వా—రామచంద్రా! అల్లదే చూడు. దుష్టరాక్షసియగు తాటకి మనల డాయ నిటే వచ్చుచున్నది. దాని నొక్కకోలచే మట్టుబెట్టుము.

రాము—గురువరా! స్త్రీని జంపుట పాపముగదా. ఇట్టికార్యమెట్లొనరించగలను?

విశ్వా—రామా! ఇనకులవార్ధిసోమా!

గీ॥ స్త్రీలజంపుట పాపంబు ♦ క్షితి నిజంబె
మన మొనర్చు సత్కార్యముల్ ♦ మాటగలుప
భీకరాకృతితో వచ్చుఁ ♦ బిడుగురీతి
దీని జంప సందియమేల ♦ ధీవరేణ్య!॥

రాక్షసాంగనయగుటచే దీనిం బరిమార్చిన పాతకము రాఁజాలదు. సత్వరము సాహసించుము.

రాము—చిత్తము. అట్లైన మీయాజ్ఞానుసారము వర్తించెద. (తమ్మునిజూచి).

క॥ తమ్ముడ! కనుమీ రక్కసి
నమ్ముల చేఁబూని పీచ ♦ మడఁగగ దానిన్
ఖమ్ముడరఁగ మహి వడఁకఁగ
సమ్మతి ఖండింపుమీవు ♦ సంయమియాజ్ఞన్॥

లక్ష్మ—అన్నయ్యా.

ఉ॥ తాటకి గీటడంచఁగను ♦ దాపసి యాజ్ఞ వహించినాఁడ, నే
గాటపు బాణజాలములఁ ♦ గామినిపై నిడఁజాలనన్న! యీ
బోటిని నాసికాశ్రవణ ♦ ముల్ దెగగోసి విరూపిఁజేసెదన్
మాట లికేటికయ్య మరి ♦ మానినిఁద్రుంచగ జేతులాడునే॥ 7

తాట—ఓరోరి మానవాధములారా! నిర్జనప్రదేశంబగు నా ఘోరారణ్యమేల జొచ్చితిరి? నేను తొలిముద్దగ మిమ్ముఁ గబళించెద. వెరచి పారకుడు|
(అని రామునిపైకి దుముకును).

రాము— ఉత్సాహము.

మమ్ము మ్రింగనెంచి నావ ♦ మాయలాడి రక్కసీ
పొమ్ము వేగఁ గూయకుండ ♦ పొదలచాటు మాటుకన్॥

తాటకి— ఉత్సాహము.

రమ్ము నన్ను ద్రుంచవేగ ♦ రాచబిడ్డ వేగమే.
పొమ్మటంచు బల్కనేల ♦ పోటుతనముఁ జూపరా॥ 8

రాము—ఆ, యేమీ! నాపోటుతనము జూపవలెనా?

క॥ చచ్చెదు నాచేకోలన్
వచ్చెను రాముఁడు దనుజ • వధ నొనరింపన్
జెచ్చెర విడిచెద నిల్వుమి
యచ్చెరువౌ నిన్నుజూడ • నాహవమందున్॥

(అని బాణము వేయును. తాటకి నేలబడి)

తాట—హా! చచ్చితి చచ్చితి (అని తన్నుకొనుచు ప్రాణములు విడుచును).

విశ్వా—రఘునందనా! తాటకిని గూలమీటితివి. సర్వజనులకు సంతసంబయ్యె గాన నిక నిజాశ్రమంబున కరుగుదము రమ్ము.

రాము—చిత్తము. (అని నడచుచుందురు).

విశ్వా—రామచంద్రా! మదీయ సవనాలయమిదియే. నేను యజ్ఞదీక్షం బూనెదఁ గాన మీరలు శస్త్రాస్త్రంబులు ధరియించి జాగరూకతతో నుండుడు. ఆ దుష్టరాక్షసు లనేక మాయలు పన్నెదరు. అట్టి మాయలెల్ల సతిజాగ్రత్తతో నరయుడి నేనేగెద.

రాము—చిత్తము. తమ యాజ్ఞ శిరసావహించి యల్లే కాచియుందుము.

(విశ్వామిత్రుడు నిష్క్రమించును).

రాము—తమ్ముడా! దుష్టరక్కసు లదృశ్యరూపులై రక్తమును ధారగా బోయుచుండిరి. వారల నిప్పుడ మట్టుబెట్టెద. నావాయువ్యాస్త్రంబు సత్వరంబిట్టిమ్ము.
లక్ష్మణుఁడు బాణమిచ్చును. రాముడు అందుకొని బాణము విడచును. అంత సుబాహుడు క్రిందబడి చచ్చును. మారీచుడు పరుగిడును)

రాము— తే॥గీ॥ అనుజ గనుగొను దనుజుల • పనులనెల్ల
మింటనిలిచియు గురిపింతు • రిట్టువిడని
రక్తధారల నియధ్వ • రంబు సెకుపఁ
జెడుటకై కాదె వీరికీ • వెడగుబుద్ధి॥

లక్ష్మణా! మారీచ సుబాహుల నెడి యీ యధమదానవులే కౌశికుని వ్రతనిష్ఠకుఁ బ్రతిబంధకములఁ గల్పించుచుండిరి. మన కౌశికుని యాగమునకు నేడు కడసారిదినమగుటచే జన్నమునకు పూర్ణాహుతియు నాశరములకు వీరాహుతియు నగుట నమకూడినవి.

లక్ష్మ—అన్నయ్యా! యీ నిశాచరు లెన్నెన్నిమాయుల బన్నుచు మింట జరించుచుండిరి! కనుకనే రక్కసులు మాయలమారు లందురు.

రాము—అవును. మన గురువుగారును నిటే వచ్చుచున్నారు.

(విశ్వామిత్రుడు ప్రవేశము.)

రాము—గురువరా! నమస్కారము.

విశ్వా—రఘుకులతిలకా! శుభమగుగాక.

రాము—మునిపుంగవా! యజ్ఞభంగము గావింపఁ బయత్నించిన సుబాహువను రక్కసుని గనుము. గగనమార్గమున మిట్టిపడుచుండ నీతని మట్టుబెట్టితిని. (అని చూపును)

విశ్వా—కదనవిజయరామా! అమందానందుఁడనైతి. రామచంద్రా! మిధిలయందు జనక మహారాజొనరించు యాగము జూడ ననేకమునిపుంగవులు పోవుచుండిరి. మనము నటకు బోవుదమురండు. అచ్చట;

క॥ శంకరు చాపముగలదట
జంకక యది యెక్కువెట్ట। జాలినచో ని
శ్శంకఁ సీత నొసంగెద
పొంకముతో నంచుదెలిపె। భూరమణుండుర్॥

కావున నచ్చటి కనేకదేశాధీశు లావిల్లు నెక్కువెట్ట వచ్చియుండిరట. మనముకూడ నటకు పోదమురండు. వీలైనయెడల నాకార్యమునకు మీరును బ్రయత్నింపవచ్చును.

రాము—తమ యనుగ్రహమున్న బ్రయత్నింపకేమి?

విశ్వా—రండు పోదము.

రామ, లక్ష్మ—చిత్తము. (అని కొంచెము నడచి) మునివరా! ఈ యాశ్రమ మెవరిది?

విశ్వా—రామచంద్రా! ఇది గౌతమాశ్రమము. గౌతమపత్నియగు నహల్య శాపవశముచే పాషాణాకృతిదాల్చి పడియున్నది. అల్లదే చూడుము.

రాము—గురువరా! ఇదేనా? (అని రాతినితన్నును.)

(అంత అహల్య నిజరూపముతో నిలిచి) (4 అనుబంధము)

అహల్య— గీ॥ రామచంద్రయ లోకనం। రక్షకాయ
వందనంబులు పదివేల। వందనములు
మేల్మి మీపదధూళి నా। మేనసోక
నన్ని పాపము లడుగంటె। నయ్య నేడు॥

రామచంద్రా! యనేకవర్షములనుండి యీ కారడవిని శిలనైయుంటి. నేటికి మీపదసరోజపరాగంబుచే శాపవిముక్తినొందితిఁ గాని శిలామయమైన నా తనువును తాకుటచేత మీ మృదుపదంబు లెంత నొచ్చెనో కదా! మీ పదసేవఁ జేసెద. నన్ననుగ్రహింపుఁడు.

(అని పాదములపైఁ బడును.)

రామ—(లేవదీసి)

సీ॥ తమ్మికంటిరో! లెమ్మింక । సమ్మదముగ
నీకు శాపంబు నేఁటితో । నీఁగఁగలదె
యింక పతిచెంత కేఁగుని । శ్యంగతోడ
సతులగుణ సుమాంగల్య యు । హల్య నీవు॥

అహల్యా! నీ నాథుండగు గౌతముండు సిద్ధచారణసేవితంబైన హిమగిరియందు దపమాచరించుచుండె. నీవును నా వడకుఁగుబ్బలికిజని నీ నాథుని గూడి సుమంగలివై సుఖముగా నుండుము పొమ్ము.

అహ—రామచంద్రా! మహాప్రసాదము.

రామ—మంచిది పొమ్ము. (అహల్య నిష్క్రమించును.)

విశ్వా—రామచంద్రా! మిథిలానగర మిచ్చటి కర్ధయోజనమందున్నది.

చ॥ జనకుని యాగముస్సనగ । చయ్యన రండిక జాగుసేయక౯
వనము నతిక్రమించవలె । వాసిపురంబును జేరి నిత్తఱి౯
గనుగొన నంధకారమిక । గప్పదొడంగెడి నంతెగాక స
న్మునివరులందరేగిరి ప్ర । మోదముతో ముత యజ్ఞశాలకు౯॥

రామచంద్రా! జాగుసేయక రండు పోదము (నిష్క్రమింతురు).



తురీయ రంగము—మిథిలానగరము: జనకుని యాస్థానము.

(కొందరు మనలును వివిధదేశాధీశులును నాసీనులై యుందురు).

జన—మంత్రీ! జన్నముకొఱకు సకల మునిజనులిదివరకే వచ్చియుండిరి. శంకరుచాపమెత్తి నా ముద్దుపట్టిని గ్రహించుటకై సకలదేశాధీశులును విచ్చేసిరా?

మంత్రి—మిథిలేశా!

సీ॥ మాళవ, కేరళ, । మగధాంధ్ర, సౌరాష్ట్ర
పాంచాల, బర్బర । పార్థివులును
సింధు, వంగ, కళింగ । సింహళ, శక, గౌళ,
కాశ్మీర, బాహ్లీక । కాశి, పతులు
కురు, కరూశాది । కోసల, కుంకణ,
కొంకణ, పాండ్యాది । కుతలవరులు
భోజ, కుళింద, కాం । భోజ, కుంతల, చోళ,
లాట, చేది, మరాట । రాజులెల్ల,

తే॥ గీ॥ వచ్చియుండిరి కొల్వున । కచ్చెరువుగ
ముచ్చటలు మీర మీసుత । నిచ్చటికిని

వచ్చునట్టులఁ జేయుడీ ♦ సచ్చరిత్ర
జనక భూపాల సద్గుణ ♦ గణ సుశీల ॥

(అంత రామలక్ష్మణ విశ్వామిత్రులు పునః ప్రవేశము)

జన—గాధినందనా! నమస్కారము.

విశ్వా—దీర్ఘాయురస్తు.

జన—తే॥ గీ॥ గాధి నందన! నాయాగ ♦ కార్యమునకు
వచ్చితిరి నేడు ధన్యుండ ♦ వసుధనాదు
యాగఫలమిప్డు పండె జూ, ♦ యతికులేంద్ర!
జన్మము సమాప్తి నొందించి ♦ చనుఁడు మీరు ॥

సంయమీంద్రా!

ఉ॥ భూరిబలాఢ్యులీశిశులు ♦ బుద్ధికిఁ బెద్దలొ కేవయస్కులో
ధీరులు వీరలిర్వు రినతేజులె ♦ వారికి పుత్రులయ్య? యా
కారముఁ జూడఁజూడఁగను ♦ కన్నులపండువు గల్గెనయ్య? స
ద్గౌరవముంచి జెప్పుడిక ♦ గాధితనూభవ మీకు మ్రొక్కెదన్ ॥

విశ్వా—జనకమహారాజా! వీరు రామలక్ష్మణులనువారు. అయోధ్యాపురవాసులు. ఇనకులోద్భవుండైన దశరధమహారాజు కుమారులు. వీరలు

ఉ॥ తాటకి రూపుమాపి, ఘన ♦ దర్పితుఁడైన సుబాహునిన్ వడిన్
గాటికి బంచి సత్వరము ♦ గౌతమపత్నికి శాపమోక్షమున్
ధాటిగఁ జేసి తామతిము ♦ దంబున వచ్చిరి నీ గృహంబునన్
జాటఁగనున్న శంకరుని ♦ చాపము నెక్కుడఁబూని యుత్తరిన్ ॥

జన—చిత్తము. అట్లుచేయవచ్చును (సభజూచి)

ఉ॥ భూపకుమారులార! కడు ♦ భూరిపరాక్రమశాలులార! యీ
చాపము నెక్కువెట్టగల ♦ క్ష్మాతలనాధున కిత్తుజానకిన్
నాపయిగూర్మినించి యిట ♦ నల్వురిలో భుజవిక్రమంబునన్
పాపలు పెద్దలంచనక ♦ పట్టిన పట్టున నెక్కువెట్టుడీ ॥

పూజ్యులగు రాజకుమారులారా! తీవ్రగతి నికార్యమునకు నుద్యుక్తులు గండు.

రాము—గురువరా! అనుజ్ఞ నొసంగుడు.

విశ్వా—రామా! సద్గుణస్తోమా!

గీ॥ ధనువుచేపట్టి మెల్లగ ♦ మనము లలర
నారి బిగియించి శస్త్రాలు ♦ [illegible]
జేయుమీ రామ! యెల్ల జే ♦ జేలువొగడ
రాముఁడితఁడు కోదండ ♦ రాముడంచు.

రామ — చిత్తము. లోకారాధ్యులగు నో మునిపుంగవులారా! సర్వసంపత్పరిపూర్ణులగు నో కుంభినీధవులారా! సెలవొసంగ వేడుచుంటి. (అనిమెత్తపోవును)

(5 అనుబంధము)

విశ్వా:— గీ॥ కదలఁబోకు వసుంధర! ♦ కాస్యపిఁ దగఁ
బట్టుకొమ్ము నాగేంద్ర! భూ ♦ ఘనులఁబట్టు
కొమ్ముకూర్మమ! శివుని చా ♦ పమ్ము నెక్కు
వెట్టుచున్నాఁడు రామ భూ ♦ విభుసుతుండు॥

(రాముడు విల్లెక్కిడఁబోవ మధ్యకువిరుగును. సీత పూలహారము రాముని మెడలో వేయును. రాజులు పోవుదురు.)

(6 అనుబంధము.)

మునులు — శ్లో॥ జయతు జయతు రామా! జానకీచిత్తకామా!
జయతు గిరిశమిత్రా! సారసాప్తాబ్జనేత్రా!
జయతు శుభచరిత్రా! శ్యామలోపేత గాత్రా!
జయతు భక్తకల్పా! సర్వరాజేంద్ర తల్పా!

జన — మంత్రీ! శ్రీరాముని యవక్రపరాక్రమంబెల్ల వర్ణించుచు అయోధ్యాపురంబున కొక శుభలేఖ నిట్లు వ్రాయుము. మీ పుత్రరత్నమగు శ్రీరాముడు శంకరుచాపమును విరిచి సర్వమునిజనన్నృపాలసమ్ముఖమం దుత్తీర్ణుడయ్యెగాన నా పుత్రికయగు జానకినిచ్చి వివాహముసేయ నిశ్చయించితిని. మీరాద తమరు పుత్రమిత్రామాత్య పరివార బంధుసహితంబుగా మిథిలాపురికి విచ్చేసి పరిణయము నిర్వర్తింతురుగాక, అనివ్రాయుము.

మంత్రి — చిత్తము. (అని లేఖవ్రాసి దేవా చిత్తగించుడు.

తే॥ గీ॥ రాజరాజేంద్ర పూజ్యులై ♦ గ్రాలుచున్న
పంక్తిరథునకు జనకుండు ♦ ప్రణుతిజేసి
వ్రాసికొన్నట్టి శుభలేఖ ♦ వరుసవినుడు
మిథిలలో మాకు క్షేమంబు ♦ మీకు శుభమె॥

అవక్రపరాక్రముఁడైన మీ తనయుఁడు చిరంజీవియగు శ్రీరామభూపాలున కస్మత్పుత్రికయగు సీతాదేవినిచ్చి చైత్రశుద్ధ నవమి భానువాసరంబున పగలు పదునాలుగు ఘడియలమీదట పూర్వఫల్గునీ నక్షత్రయుక్త మిథునలగ్నమున వివాహముచేయ పెద్దలు నిశ్చయించినారుగాన మీరు పుత్రమిత్రామాత్య పరివార సహితముగా మిథిలానగరమునకు దయచేయప్రార్థితులు.

మిథిలానగరము. } ఇట్లు, భవద్విధేయుడు,
జనకుడు.

జన—మంత్రీ! యీ శుభలేఖ నయోధ్యాపురంబునకు బనిచి యిక్ష్వాకుకులోద్ధారకుండైన దశరథేశ్వరుని మిథిలానగరమునకు వచ్చునట్లు సేయుము.
మంత్రి—చిత్తము అట్లనే జేసెద.
జన—యతికులేంద్రా! రామచంద్రా! కల్యాణమండప మలంకరింప దయసేయుడు.
రాము—చిత్తము. గురువరా దయచేయుడు. (అందరు నిష్క్రమింతురు.)

(అవనిక జారును.)

(వశిష్ఠ, విశ్వామిత్ర, దశరథ, సీతా రామ లక్ష్మణులు పునఃప్రవేశము)

రాము—గురువరా! అల్లదే అటుజూడుడు.

తే॥ గీ॥ నభముజూడగ కప్పతో ◆ నంటుకొనఁ
గలిసిగానక మది చప ◆ లత వహించి
జంతు వితతి వాతోద్ధూత ◆ జలధరముల
భాతి జెదరి కుయ్యిడుచుండె ◆ బహువిధముల॥ 23

గురువులారా! దేశమెల్ల నంధకారబంధురంబయ్యె. (ఆలకించి) యేమి యీ సవ్వడి ధనుష్టంకార మొనర్చుచుండిరి ఇట్టి ఘోరారణ్యమునం దీ యర్ధరాత్రిమున నెవ్వ రీధనుష్టంకార మొనర్చుచున్నారు?

(కోపముతో పరశురాముడు ప్రవేశము) (7 అనుబంధము)

రాము—అయ్యా! నమస్కరోమి.
పరశు—మత్త॥ ఓరి శంభుని ప్రాతచాపము ◆ నొంచినాపనివింటి నీ
ధీరతంబొగడంగఁ జాలిన ◆ ధీరులీ భువిలేరు, పా
ల్పారబారక నాదుసింగిణి ◆ నాజెమొప్పఁగద్రుంచి నీ
పేరు ధారుణి నిల్పుకొమ్మిక ◆ విక్రమాఢ్యుడ వైనచో॥

రాముఁడ నేనుండ వేరొండురాముఁ డుండదగునా! నన్నును నాచాపమును నతిస్వల్పముగా నెంచుచుంటివా? ఇద్ధరాచక్రంబేలు ధరాధపుల తలల నిరువదియొక్కమారు ఖండించి స్వర్గమునకు సోపానము లమర్చితి. విలువిద్యయందు శంకరునోడించి మించితి. ఇట్టి పేరుఁడనగు నాకు జెల్లుగాని రామశబ్దము నీకు సార్థకమగునా? జనకునింట పుచ్చిన సింగిణి యనుకొంటివా విరుచుటకు? వేయేల? కదనమునకు రమ్ము. లేకున్న నొక్కపరి కేల్మొగిచి పొమ్ము.

రాము—అయ్యా, భార్గవరామా!

గీ॥ మునులయందున సద్గురు ◆ మూర్తి వనుచు
పుడమిసురలందు సుచరిత ◆ పుణ్యుఁడనుచు
మ్రొక్కితినిగాని మీమది ◆ ముఖ్యమటుల
నున్న నే నాజిసేయఁగ ◆ నున్నవాఁడ॥

రామ — చిత్తము. లోకారాధ్యులగు నో మునిపుంగవులారా ! సర్వసంపత్పరిపూర్ణు
లగు నో కుంభినీధవులారా! సెలవొసంగ వేడుచుంటి. (అనియెత్తబోవును)

(5 అనుబంధము)

విశ్వా:— గీ|| కదలబోకుము వసుంధర! కాశ్యపిఁ దగఁ
బట్టుకొమ్ము నాగేంద్ర! భూఫణులఁబట్టు
కొమ్ము కూర్మమ! శివుని చాపమ్ము నెక్కు
వెట్టుచున్నాడు రామ భూవిభుసుతుండు||

(రాముడు ఫెల్లుక్కుడఁబోవ మధ్యకు విరుగును. సీత పూలహారము
రాముని మెడలో వేయును. రాజులు పోవుదురు.)

(6 అనుబంధము.)

మునులు — శ్లో|| జయతు జయతు రామా! జానకీచిత్తకామా!
జయతు గిరిశమిత్రా! సారసాప్తాబ్జనేత్రా!
జయతు శుభచరిత్రా! శ్యామలోపేత గాత్రా!
జయతు భక్తకల్పా! సర్వరాజేంద్ర తల్పా!

జన— మంత్రీ! శ్రీరాముని యవక్ర పరాక్రమంబెల్ల వర్ణించుచు అయోధ్యా
పురంబున కొక శుభలేఖ నిట్లు వ్రాయుము. మీ పుత్రరత్నమగు శ్రీరా
ముడు శంకరుచాపముం దునిమి సర్వమునిజననృపాలసమ్ముఖముం దుత్తీర్ణు
డయ్యెగాన నా పుత్త్రికయగు జానకినిచ్చి వివాహముసేయ నిశ్చయించితిని.
మీరద తమరు పుత్రమిత్రామాత్య పరివార బంధుసహితంబుగా మిథిలాపురికి
విచ్చేసి పరిణయము నిర్వర్తింతురుగాక, అనివ్రాయుము.

మంత్రి— చిత్తము. (అని లేఖవ్రాసి దేవా చిత్తగించుడు.

తే|| గీ|| రాజరాజేంద్ర పూజ్యులై గ్రాలుచున్న
పంక్తిరథునకు జనకుండు ప్రణుతిజేసి
వ్రాసికొన్నట్టి శుభలేఖ వరుసవినుడు
మిథిలలో మాకు క్షేమంబు మీకు శుభమె||

అవక్రపరాక్రముండైన మీ తనయుఁడు చిరంజీవియగు శ్రీరామభూపాలు
న కస్మత్పుత్త్రికయగు సీతాదేవినిచ్చి చైత్రశుద్ధ నవమి భానువాసరంబున
పగలు పదునాలుగు ఘడియలమీదట పూర్వఫల్గునీ నక్షత్రయుక్త మిథునల
గ్నమున వివాహముచేయ పెద్దలు నిశ్చయించినారుగాన మీరు పుత్రమిత్రా
మాత్య పరివార సహితముగా మిథిలానగరమునకు దయచేయ ప్రార్థితులు.

మిథిలానగరము. } ఇట్లు, భవద్విధేయుడు,
జనకుడు.

జన—మంత్రీ! యీ శుభలేఖ నయోధ్యాపురంబునకు బనిచి యిక్ష్వాకుకులోద్ధారకుండైన దశరథేశ్వరుని మిథిలానగరమునకు వచ్చునట్లు సేయుము.

మంత్రి—చిత్తము అట్లనే జేసెద.

జన—యతికులేంద్రా! రామచంద్రా! కల్యాణమండప మలంకరింప దయసేయుడు.

రాము—చిత్తము. గురువరా దయచేయుడు. (అందరు నిష్క్రమింతురు.)

(అవనిక జారును.)

(వశిష్ఠ, విశ్వామిత్ర, దశరథ, సీతా రామ లక్ష్మణులు పునఃప్రవేశము)

రాము—గురువరా! అల్లదే అటుజూడుడు.

తే॥ గీ॥ నభముజూడగ నిప్పుతో ♦ నంటుకొనె
గతినిగానక మది చప ♦ లత వహించి
జంతు వితతి వాతోద్ధూత ♦ జలధరముల
భాతి జెదరి కుయ్యిడుచుండె ♦ బహువిధముల॥ 23

గురువులారా! దేశమెల్ల నంధకారబంధురంబయ్యె. (ఆలకించి) యేమియీ సవ్వడి ధనుష్టంకార మొనర్చుచుండిరి ఇట్టి ఘోరారణ్యమునం దీయర్ధరాత్రమున నెవ్వరిధనుష్టంకార మొనర్చుచున్నారు?

(కోపముతో పరశురాముడు ప్రవేశము) (7 అనుబంధము)

రాము—అయ్యా! నమస్కరోమి.

పరశు—మత్త॥ ఓరి శంభుని ప్రాతచాపము ♦ నొంచినావనివింటి నీ
ధీరతంబొగడంగ జాలిన ♦ ధీరులీ భువిలేరు, పౌ
ల్వారబారక నాదుసింగిణి ♦ నాశమొప్పగద్రుంచి నీ
పేరు ధారుణి నిల్పుకొమ్మిక ♦ విక్రమాఢ్యుడ వైనచో॥

రాముడ నేనుండ వేరొండురాముడుండదగునా! నన్నును నాచాపమును నతిస్వల్పముగా నెంచుచుంటివా? ఇద్ధరాచక్రంబెలు ధరాధపుల తలల నిరువదియొక్కమారు ఖండించి స్వర్గమునకు సోపానము లమర్చితి. విలువిద్యయందు శంకరునోడించి మించితి. ఇట్టి వీరుడనగు నాకు చెల్లుగాని రామశబ్దము నీకు సార్థకమగునా? జనకునింట పుచ్చిన సింగిణి యనుకొంటివా విరుచుటకు? వేయేల? కదనమునకు రమ్ము. లేకున్న నొక్కపరి కేల్మొగిచి పొమ్ము.

రా.మ—అయ్యా, భార్గవరామా!

గీ॥ మునులయందున సద్గుకు ♦ మూర్తివనుచు
పుడమిసురలందు సురుచిర ♦ పుణ్యుడనుచు
మిక్కిలినిగాసి మీమది ♦ ముఖ్యమటుల
నున్న నే నాజిసేయగ ♦ నున్నవాడ॥

పర—అటులనా? పాపము యెంత కనికరముదలంచితివి. మునిజనులైన నేమి? నీవు రాజవంశ సంభూతుడవై క్షాత్రధర్మము నిలుపుకొనన్ దలచితివేని రణమ్మునకు రమ్ము. లేకున్న నమస్కరించి పొమ్ము.

రాము—ఆ! యేమీ? భార్గవరామా! కదనమందు నమస్కరించవలెనా?

ఉ॥ పాలుడ నిన్ను దుంచినను ౹ పాతకమంచు మదింగలంచితిన్
గాలులు ప్రేలెదే భళిర ౹ కయ్యమునన్ దెగటాటివాడవే
ధీరుడు రాముడంచనక ౹ తేలికగా ననుజూచెదార ఛీ!
పోరొనరించినన్ వడిగ ౹ బొందెదు స్వర్గపదంబు శిత్త్రిన్॥

(అని శరము విడుచును.)

(అంత పరశురాముడు దండప్రామము గావించి)

గీ॥ నీదు మహిమం బెరుంగక ౹ నేనుచాల
మేరమీరుచు బల్కితి ౹ మేదినీశ
నీవు శ్రీవిష్ణుమూర్తివి ౹ నిగమవేద్య
నాదు తప్పులు సైరించు ౹ నతులొనర్తు॥

రామచంద్రా! నేను మహేంద్రాద్రికిం జని నారాయణచరణంబు శరణంబుగా కాలము గడపెద, ననుజ్ఞ యొసంగుము.

రాము—మంచిది అటులనే పొండు.

(పరశురాముడు నిష్క్రమించును)

రాము—గురువులారా! చాల తడవయ్యె. పోవుదమురండు.

విశ్వా—అటులనే పోదము.

(అందరు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము—సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము.

## ద్వితీయాంకము

### ప్రథమరంగము - అయోధ్యానగరము.

(వశిష్ట, దశరథ, సుమంత్రులును, కొందరు మునులును ప్రవేశింతురు.)

దశ—గురువరా! మునిపుంగవులారా!

తే॥ గీ॥ సకల భోగంబులను గంటి ♦ సరసగతిని
పెద్దకాలంబు నేలితి ♦ పృథ్వినెల్ల
సుగుణనిధులని పేర్గాన ♦ దగినయట్టి
పుత్రులను గంటి నిగమ స ♦ మూహముగను॥

క॥ సుతులందు నగ్రజుండును
మతిమంతుడు ధీరుడైన ♦ మా రామునకున్
హితముగఁ బట్టముఁగట్టగ
మతిదలచుచు నుంటినయ్య ♦ మునివరేణ్యా॥

నేనిప్పటికి వయోవృద్ధుడనైతి. కిరీటభారమును భరింపఁజాలకున్నాడ. కాన శ్రీరామునకు బట్టముఁగట్టి విశ్వవిశ్వంభరాభరంబెల్ల భరింప నాతని నియోగింప త్రికాలజ్ఞులగు తమ సెలవు గోరుచుంటి.

వశి— గీ॥ రమణ గుణోత్కుడు శ్రీరఘు ♦ రాముబిలిచి
పరగ నీ కోర్కెఁ దెల్పు మిప్పట్ల వేడ్క
నతని సమ్మతిఁ గైకొని ♦ యనల మనము
కార్య మారంభమునఁ జేయఁ ♦ గడగఁ దగును॥

దశ—చిత్తము. ఎవడురా అక్కడ.

సేవ—అయ్యా, సేవకుడను.

దశ—ఓరీ! శ్రీరాముని నిటు దోడ్కొనిరమ్ము (సేవకుడు నిష్క్రమించును).

వశి—దశరథ మహారాజా! శ్రీరాముని యభిప్రాయము నెఱింగినపిదప నట్టి కార్యమున కుపక్రమించవలెను సుమీ.

దశ—చిత్తము. అదిగో శ్రీరాముడిదే వచ్చుచున్నాడు.

(రాముడు ప్రవేశము)

రాము—త్రికాలవేదులగు మునిపుంగవులారా! అభివాదనము. జనకా! నమస్కారము.

ముని—విజయోస్తు. విజయోస్తు.

దశ—శీఘ్రమేవ రాజ్యాభిషేక ప్రాప్తిరస్తు. తనయా!

ఆ॥ వె॥ పెద్దవాడనైతి। పృథ్వీభరంబింక
మోయజాలనయ్య। పుత్ర! మరియు
నీకు దీనినొసగి। నా కన్నులారంగ
గాంచగోరి పిలువ। బంచినాడ॥

ఇందుకు నీ యభిమతం బెట్టులుండెనో నెఱింగింపుము.

రాము—జనకా! నేను నీయభిప్రాయంబు నతిక్రమించి వేరుగ నడతునా! నీ యభిమతమే నా యభిమతము.

ముని—మేలు రామచంద్రా, మేలు. పలుకదగిన మాట పలికితివి.

దశ—మునివరులారా! వింటిరికదా! సుతుని సమ్మతి ఇక తమ యాజ్ఞ యెట్లుండెనో సెలవీయ వేడుచున్నాడ.

వశి—శ్రీరామమూర్తి సెలవయిన వెనుక మాయాజ్ఞ వేరుగనుండునా? శుభస్య శీఘ్రమ్మనినట్లు వెంటనే పట్టాభిషేకమహోత్సవము గావింపుము. నేటికి మూడవ దినముందే శుభముహూర్తము గలదు.

ముని—ఔను రాజా! తప్పక యట్లు కావింపుము. మాకనుష్ఠాన కాలంబగుచున్నది. పోయి వచ్చెదము.

(మునులు నిష్క్రమింతురు).

దశ—రామభద్రా! పట్టాభిషేకోత్సవ ప్రయత్నములు చేయుటకు మనము త్వరపడవలసి యున్నది. పోవుదము రమ్ము.

రాము—చిత్తము. (నిష్క్రమింతురు).

(మంధర ప్రవేశము)

మంధ—(తనలో) ఈ రాజసభలో నేడు జరిగిన ప్రసంగము నంతను ఈ చెంత నుండి నేను వినుచున్నాను. అట్లుపొంచి యితరుల రహస్యములు వినుట నా స్వభావము.

ఇప్పుడు రామునకట పట్టాభిషేకమట. ఇంతటి శుభకార్యము నేను జూచి యోర్వఁగలనా? నాకనులోర్చునా? ఇదిగాక రాముని పేరు వినఁగానే నాకు అరికాలిమంట తలకెక్కుచుండును. ఇపుడేమి సేయుదును?

తే॥ గీ॥ రాముఁ డనఁగను నామది ◆ రగులుచుండు
రగిలి నేనేమిచేయుదు ◆ రామసుధీరు
నేమిసేయుదు? నావల్ల ◆ నేమి కాదు?
తొల్లి ననుమోదె సభలోన ◆ నుల్లసముగ॥

అప్పటినుండియు రాముని వంచింపవలెనని మనమునఁ దలఁచుచుంటిని. సమయము రాదయ్యె. చిన్నప్పటినుండియు నాస్వభావము దుస్స్వభావమైనను సమయము రానిది దుస్స్వభావ మక్కరకు వచ్చునాయని మిన్నకుంటి. నా స్వభావమేమన.

సీ॥ నామాటలను విని ◆ నమ్మినవారికి
సిగపట్లు పట్టఁగాఁ ◆ జేయఁగలను
అనతికాలంబులో ◆ వినతులు గావించి
బుద్ధికలంగఁగా ◆ పోరఁగలను
అగచేత వైకుంఠ ◆ మటుచూపి నమ్మించి
గురుశుభంబులు చెడఁ ◆ గొట్టగలను
దాంపత్యములు వీడ ◆ తంపిపెట్టి రగిల్చి
బలె సెబాసన వేరు ◆ పరచఁగలను
తే॥ గీ॥ తల్లిబిడ్డల నెడబాపి ◆ దయలమాపి
అన్నదమ్ముల నేస్తంబు ◆ సున్న జేసి
తలల పగఁగోయునంతటి ◆ దుష్టమైన
చేతలారంగఁ బొంగుచు ◆ జేయగలను॥

కైకేయికి సైతము నాలో సగమంశమున్నది. ఎట్లయిన రామునికి పట్టము గట్టకుండఁగ జేయించెద. ఇంక జాగుసేయరాదు. కైకయాంతిపురంబునకుఁ జని కలవి లేనివి కల్పించి కయ్యము పెంచెద.

(అని నిష్క్రమించును.)



ద్వితీయరంగము — కైకమందిరము.

(కైక మందిరమున ముసుగిడి నేల పరుండును. దశరథుడు ప్రవేశించును.)

దశ — (తనలో) విద్యుత్కాంతులీను నా దేవేరి సౌధరాజ మేలా? యంధకార బంధురమై నేఁడు కన్పట్టుచున్నది.

ఉ॥ సారస హీనమౌ కొలను ♦ శారికలార్వని పంజరంబు ని
స్సారము జెందు చందురుడు ♦ నాహిణిలేని తురంగశిక్ష మేల్
సారసవైరిలేని సుని ♦ శం బడవిన్ విరజల్లు చంద్రికల్
పోలికనూడె నంగణపు ♦ పొల్పిసుమంతయు గాన మియ్యెడన్॥

(ఆశ్చర్యముతో) యేమీ యొక్క చేటికైన గానరాకున్న దే!
(దిక్కులు చూచి)

తే॥ గీ॥ కోపమునఁబూని కైకేయి ♦ కోర్కెలేము
దీరనట్టుగ శయనించె ♦ దీనదశను
రత్నమణిమయభూషల ♦ రక్తిపీడి
మైల వలువలు ధరియించి ♦ మందిరమున.

దేవేరి యిట్లుకినుకఁబూను కారణ మేమైయుండును. (ఆలోచించి) సహజ కోపస్వభావులకు అన్నియు నేరములుగనే కన్పట్టును. (దగ్గరజేరి) దేవీ,

చ॥ అలుకవహింపనేల మలి ♦ నాంబరముల్ ధరియింపనేల ని
శ్చలముగనుండ నేల మెయి ♦ చాయ గృశింపఁగ నుందనేల చిం
తలఁబడి క్రాగనేలఁ గల ♦ దానివచింపగ జాగికేల స
ల్లలిత ముఖాబ్జ మిత్తరి వ ♦ శిక్షము వారఁగనేల భామినీ॥

మదగజయానా! దీనవదనారవిందవై చింత క్రాంత చిత్తముతో వంతలకు లోఁబడనేల? నీ కపరాధమొనర్చిన దుష్టస్వభావు లెవ్వరైనను సరే తప్పక శిక్షించెదను. దాచక చెప్పుము.

సీ॥ సవతులు నిన్ జూచి ♦ చౌకచేసిరొ చెప్పు
శిక్షింతువారలఁ ♦ జింతమాని
దాసదాసీజనుల్ ♦ తప్పు చేసిరటన్న
తలలు ద్రుంచెద వారి ♦ తలపుదీరఁగ
పాటింపకయె వారల్ ♦ మాట మీరిరటన్న
దండించెదను వారి ♦ దక్షణంబ
యాభరణములపై ♦ నాశయుండిన జెప్పు
కోర్కెఁదీరఁగఁదెత్తుఁ ♦ గొదువలేక

తే॥ గీ॥ లేక నాయెడ నపరాధ ♦ లేశమున్న
చెప్పి క్షమియించి బ్రోవుమీ ♦ తెల్లముగను
తప్పులన్నియు సైరింతు ♦ ముప్పులుగను
వగలఁబొగులఁగనేల నో ♦ వనజవదన॥

(అని పట్టుకొనబోవును) (9 అనుబంధము)

కైక—(కోపముతో)

తే॥ గీ॥ పురుషు లెన్నెన్నొ మాటలిం ♦ పుగను జెప్పి
యక్కరలు దీర నావల ♦ నతివ మొగము
జూడరను సామ్య మిచ్చోట ♦ నేడుదెలిసెఁ
జనుము కౌసల్యయింటికి ♦ జనుము చనుము॥

దశ—ఓహో. ఇదియా నీ కోపకారణము! ఇందువదనా,

తే॥ గీ॥ పేరునకునెంచ కౌసల్య ♦ పెద్దభార్య
ప్రేమయంతయు నీకడ ♦ పెరుగుచుండు
యీసునను బల్కెదె గాని ♦ యిప్పుడేను
సర్వమును నీదికాదె ని ♦ శ్చయము సుమ్ము॥

కైక—ఈ యుక్తులకేమి లెండు.

దశ—ఇందు యుక్తులేమున్నవి? నీవడిగిన ప్రాణముసైత మర్పింతును.

కైక—ప్రాణములనైన నిచ్చెదరా.

దశ—ఆహా. ముమ్మాటికి తప్పక యిచ్చెదను.

కైక—మంచిది. నాథా! తొల్లి నే సంగరవిజయము గాంచినప్పుడు వరములిచ్చెద
నని పల్కియుంటిరిగదా.

దశ—అవును, యిచ్చెదనని పల్కియుంటి.

కైక—అప్పుడు నేనావరములను వలయునప్పుడు కోరదననియు నట్లయిన దయసేయ
వలయుననియు కోరియుంటిని. అందులకు దేవరవారు అంగీకరించిరి నాటివర
ములు నేడీయవలయు. ఇచ్చెదరా?

దశ—సఖీ! యింతమాత్రమునకా యింత గోడవ? తప్పక యిచ్చెదను.

కైక—నాథా యిచ్చెదనని చేతిలో చేయివేయుము!

దశ—తన్వీ, చేతిలో చేయివేయవలయునా? ఈ దశరథుఁడాడితప్పువాఁడా? దశర
థుఁడేకాదు, ఈతని వంశజు లెవ్వరైన ననృతము లాడియుండిరా? ఇదిగో
యిటువినుము. (10 అనుబంధము.)

ఉ॥ భానుఁడు త్రోవదప్పినను ♦ భానుకులంబు కళంక జెందినన్
సూనులు దూపులైన ధన ♦ శూన్యత గల్గిన రాజ్యమంత ని
ర్మానుషమై చనం బోయినను ♦ మానక వార్ధిధులింకిపోయినన్
చానరో బల్కువాఁడనె యు ♦ సత్యపువాక్కులు జిహ్వఁ గోసినన్॥ 31

కైక—నాథా, అట్లయిన నాకీ వరములీయవలయు.

తే॥ గీ॥ పట్టభద్రునిఁజేయుఁడీ ♦ భరతు నొకట
పంగి రాముని వనములఁ ♦ బదియునాల్గు

వత్సరములుండఁ బంపుడీ • వసుమతీశ
నేను గోరెడువరము లి • వేను రెండు॥ 14

మనోహరా! నాకీ రెండువరము లొసఁగుఁడు. అంతియె చాలు. తృప్తి నొందెద.

దశ—హా! రఘురామా! నీలమేఘశ్యామా! సజ్జనస్తోమా! నా చిన్నితనయా! నిన్నేగతి నెడఁబాయుదురా తండ్రీ! (కోపముతో) ఓసీ! మాయలాడీ! యెంత ఘోరము గావించితివే! కైకా! నీ పల్కులు వినినది మొదలు నాగుండె లవిసిపోవుచున్నవే. వేరొండుగోరుము. కాకున్న,

తే॥ గీ॥ నీవు గోరినయట్టులె • నిక్కముగను
పట్టభద్రుని జేసెద • భరతసుతుని
రామచంద్రుని వనికంపి • బ్రతుకజాల
రెండవ వరంబుకోరు వే • రొండు వెకలి॥

అయ్యో నీమాట తలంచినంతనే నాగుండె వకావకలగుచున్నది.

కైక—నాథా! మీరు వరము లియ్యకున్న నాకంత చింతలేదుగాని ఇక్ష్వాకు కులమున మీరు జనించి యనృతమాడి కులమంతయు నపవిత్రము జేసెదరని మనమున గుందుచుంటిని.

తే॥ గీ॥ అనృత మాడుటకంటె వే • రఘములేదు
స్వాంతమందు నిజంబె యుం • చంగవలయు
సత్యమును మీరు విడనాడ • జగతిజనులు
నవ్వరే చుల్కఁజేయరే • నాథ మిమ్ము॥

నాథా! మిమ్మమైన నే వరములఁ గోరియుంటినా! తమంతట తామే యొసఁగెదమంటిరి. పిదప వగలబోగిలిన నేమి లాభము?

దశ—ఆహా కైకా! యెంత అవివేకవుదానవే! లోకోద్ధారకుండగు శ్రీరాముని వనముల కనుపుమని పట్టుబట్టితివి. హా! రామా! జితభార్గవరామా! నిన్నెట్ల రణ్యమునకు బొమ్మందు నోయీ! నాచిన్నియన్నా! నీవు సింహాసన మధిష్ఠించి రాజ్యము చేయుచుండ కన్నులారఁజూతు ననుకొంటినిరా. తండ్రీ! తుదకీపాపి కైకయగు నీ పిన్నమ్మచే ఘోరాటవుల పాలుగ వలసివచ్చెనా! హాహా!.

తే॥ గీ॥ కొల్వులోపల నాముద్దు • కొడుకు నిన్న
నేల నేలుమటంచును • నేడువల్కి
మరల నీరేడు వర్షముల్ • మమ్ముబీడి
యడవుల జరించుమంచు నె • ట్లాడు నకట !॥

హా! దైవమా యినకులోద్ధారకుని కాంతారాంతర వాసునిగాఁ జేయ

నెంచితివా? హా! తండ్రీ! తండ్రీ!

గీ॥ వైరము వహించ మేమెంతె । వారమయ్య
బాలు నీకిత్రయకానల । పాలుజేసి
క్రూరు నిటువంటి వానిని । కుమతి నన్ను
నేల బ్రతికించి తీవు స । ర్వేశ భువిని ॥

ఉ॥ చంపుము దైవమా యిపుడు । సర్వర సన్నిక జాలి బూనకే
పెంపు వహించు సూర్యకుల । వీరుని కానలకంపఁబూని నా
కొంపనుముంచె కైక, యిట । కోమలగాత్రుని రామమూర్తినిఁ
బంపి యికేల ప్రాణముల । పైథ్రమ? యింట మెలంగు టెట్టులో?

హా! తండ్రీ రామా!

గీ॥ నన్ను విడనాడి పోదువా । సన్నుతాంగ
నిన్నుఁ గన్గొని కైకేయి । సిలిఁదప్పి
నగ్గినిడికొనె కనులలో । హద్దుమీరి
నన్నుగావర వేవేగఁ । జిన్ని తండ్రీ ॥

హా! కౌసల్యా గర్భవారాసిసోమా! రామా! (అని మూర్ఛిల్లును)

(తెరజారును.)

(రాముడు ప్రవేశము)

రాము—(తనలో) నా పినతల్లి కైకమ్మ నా తండ్రియగు దశరథేశ్వరుని రెండు వరములు కోరెనట. అందు మొదటిది భరతుని రాజ్యాభిషిక్తుని జేయుటయు, రెండవది నారచీరెలు ధరించి నేను పదునాల్గు వత్సరములు కానలఁగాలము గడుపుటయు. నాజనకుడు సత్యవాక్య ధురంధరుఁడగుటచే అందులకు సమ్మతించి నాయమకోర్కె దీర్చెనట. ఇప్పుడు నేను జనకు నాజ్ఞవహించి పదునాల్గు వత్సరము లరణ్యమందు వసింప నేగవలయు గాన నా జననిని దర్శించి నాయమ్మ యనుమతివడసి మౌనివేషము ధరించి పోయెద. ఈ కర్ణకఠోరమగు వార్తవిని మాయమ్మ కౌసల్యాదేవి యెంత విలపించునో గదా. అయినను జెప్పక తప్పదు. జాగుసేయక పోయి సెలవు గోరెద.

(రాముడు నిష్క్రమించును.)

తృతీయ రంగము - కౌసల్యా మందిరము.

---

(మునివేషమున రాముడు పునఃప్రవేశము)

రాము—అమ్మా! నమస్కారము.

కౌస—తనయా! రాజ్యాభిషేకమస్తు. (చూచి) ఏల వికారవేషము ధరించితివి తండ్రీ?

రాము—ఇంకను మా యమ్మకు దెలియదు గాబోలు. ఈజాడ తెరింగించిన శోకమును మితిలేక యనుభవించును. అయినను చెప్పకతప్పదు. చెప్పెదగాక! అమ్మా నేను (11 అనుబంధము)

చ॥ జనకుని సత్యవాక్యమును ♦ జ్ఞానస్థలినిల్పగ నాత్మనెంచి కా
ననముల కేగఁగా దలఁచి ♦ నాకు సమస్తవృత్తి నల్పువాడ నో
జనని! శుభోన్నతుల్ గనగ ♦ జాలిన దీవనవెల్లనిచ్చిన
న్ననునయమొప్ప బంపుము ♦ రయమ్మున నైక వరమ్ము దీర్పగన్॥

అమ్మా చిన్నమ్మగారికి మాజనకుడు తొల్లి రెండువరము లిచ్చియుండె నట. అందు మొదటిది భరతునకు బట్టము గట్టుమనియు, రెండవది నార చీరలుధరించి నన్ను కానల కనుపుమనియు కోరెనట. అందుకు తండ్రిగారు చింతాక్రాంత మనస్కులై కుందుచుండిరి. జనకుని సత్యవాక్యము నిలుపుచు చిన్నమ్మగారి మనోరథము దీర్పఁదలచి కానల కేగెదగాన సెలవొసంగుముతల్లీ.

కౌస—హా దైవమా! నా నోముఫల మీరీతిగా ఫలింపజేసితివా? నేను చిరకాలము గొడ్డురాలుగానుండి కన్నుల కరవుదీర నొక్కపుత్రుని గన నోరువలేక పోతివా? హా! తండ్రీ! సుగుణాభిరామ!

మత్తకోకిల (12 అనుబంధము.)

కౌస— ఏలరాజ్యము లేలసంపద ♦ లేలతేకు లికేలరా
బాలచంద్రునిబోలు నిన్నెడ ♦ బాసినంతనె పుత్రకా॥

రాము— కాలకర్మముచే లభించెను ♦ కష్టకాలము దప్పునే
వేలరీతిగ నేర్చుదేలను ♦ వెంగమానుము తల్లిరో॥

కౌస— కన్నతండ్రి పురంబువీడియు ♦ కానకంబున కేగగాఁ
దిన్నగామది నెట్టునిల్పుదు ♦ ధీనిధీ దగఁ బల్కుమా॥

రాము— ఎన్నగా పితృవాక్యపాలన ♦ నెంచనట్టి కుమారకుం
డున్ననున్ మరి లేకయుండిన ♦ నొక్కటేకద తల్లిరో॥

(అంతట లక్ష్మణుడు కోపముతో ప్రవేశము)

లక్ష్మ—ఆ యేమీ! యెంతమూరము తిరిగినను మా యన్నగారు కన్పింపరు! కానల కేగియుండిరో (ఇటుచూచి) హా! రామా! నీలమేఘశ్యామా! మిమ్ము దర్శించుభాగ్యము ఈ మందభాగ్యునకు లభించునా? ఓసీ! ద్రోహీ! కైకా! నీ సుతునకు బట్టముఁగట్టవలెనా? (13 అనుబంధము)

చ॥ పరపర పెంచితి నీసుతుని ♦ బాహుబలంబున, నిన్ను జ[illegible]
గరళము నా యొనర్పు పతి ♦ తన్నివి యడుముచ్చునాం నే

మరకతము గాలఁద్రొక్కెదను ♦ మాయలమారి యికెందు జొచ్చెదో
ఎరబరికట్టు కోటికెల ♦ నేఁ గడతేర్చక యుండువాఁడనే?

రాము:—అన్నా లక్ష్మణా! నీవిట్లు భీకరాకృతినిబూన కారణమేమి చెప్పుమా?

లక్ష్మ:—అన్నయ్యా.

సీ॥ కైక నిన్నడవిఁబట్టి యీ ♦ ఖడ్గమునకు
సర్పణముచేసి కసిదీర్తు ♦ నవసరముగ
దోసకార్యమ్ము కొడిగట్టె ♦ మోసకారి
యెంతకైన మాంతకులు స్త్రీ ♦ లినకులేశ॥

అన్నయ్యా! కైకయిట్టి కృత్రిమ వగములు గోరవచ్చునా? యిట్టి పాపిని ఖండించినను పాపమనరాదు. అన్నయ్యా! సెలవొసంగుము. కైకను ఖండించి వచ్చెదను!

రామ:—అనుజా లక్ష్మణా! ఏల యిట్లు పలికెదవు?

(14 అనుబంధము.)

ఉ॥ భూతమునీకు సోకినదొ ♦ పూర్తిగ పైత్యము నెత్తికెక్కెనో
పాతకమంచునాక మధు ♦ పానముచే మదికప్పియుంటివొ
మాతనుగూర్చి యిట్టులభి ♦ మానమువీడుచు దూలనాడగా
లాతియె యిట్లు పల్కుటకు ♦ లక్ష్మణ! యిప్పుడు జేయఁబాడితే?

లక్ష్మణా! భరతుడు నాయెడ నధిక భక్తుడు. అట్టివాని నిందించుట నీకు తగవుకాదు. ఇంక శాంతమూనుము.

(అంత దశరథ, సుమిత్రి, కైక, సీతలు ప్రవేశము).

రామ:—తమ్ముడా మన జననీజనకులిటే వచ్చుచున్నారు. నమస్కరింతము రమ్ము.

లక్ష్మ:—చిత్తము.

దశ:—కుమారులారా!

తే॥ గీ॥ వనములందుండు డంచు న ♦ వ్వనజభవుడు
ఫాలతలమున లిఖియించె ♦ పాపి విధాత
రామ:— ధాత నిట్టుల దూషింప ♦ దగునె తండ్రి!
పూర్వమందు నేజేసిన ♦ పుణ్యమిదియె॥

సుమి:—హా! తనయులారా! పదునాలుగు వత్సరములు మీరు ఘోరాటవుల దిర్మ్మరుచుండ మే మేరీతిగా నీ యయోధ్యయందు సుఖ మనుభవించువారము మిమ్ము బాసిన పిదప మాకే సౌఖ్యభాజనమేల తండ్రులారా!

రాము:—అమ్మా సుమిత్రా!

తే॥ గీ॥ పదియు నాల్గు వత్సరము లే ♦ పగిదిఁ జూత
పదియునాలుగు దినములౌ ♦ పడతిమాకు
సుమి— తండ్రి యీలాగు బల్కుట ♦ తగదు తగదు
వర్షములు రోజులెట్లగు ♦ వనరుహాక్ష॥

తండ్రీ నీపితృభక్తియే నిన్ను గాపాడు. పోయిరమ్ము.

రాము—అమ్మా! కౌసల్యా! సెలవొసగుము.

కౌస—మంచిది తండ్రీ! పోయిరమ్ము. నీ సత్యమే నిన్ను గాచుగాత.

రాము—(కైకనుజూచి) తల్లీ కైకమ్మా! సెలవొసగుము.

కైక—శీఘ్రిమే పోయిరమ్ము. సత్యమునిలుపవలెనుగదా ?

రాము—సోదరా లక్ష్మణా! నిన్నెడబాయవలసి వచ్చినది. నిలువుము. శాంతముతో నుండుము. నేనింక పోయివచ్చెద.

లక్ష్మ—ఏమీ! నిన్నెడబాయుటా! యిచట నిలుచుటా! శాంతముననుండుటా! ఎంత చిత్రము. అన్నా యిన్నిమాటలేల? నేను నీతోడనే వచ్చెదను. నీవు గట్టిగ నెడబాయుమనునెడ నే నీశరీరమునే యెడబాయుదును.

రాము—(తనలో) ఈతనిరాక ననుమతింపక తీరదు. కానన్న నీ సౌమిత్రి నిజముగ మేనుదొరంగగలడు. (ప్రకాశముగ) మంచిది సోదరా, నీవును వచ్చెదవా? యింట నుండవా? అయిన రమ్ము. చాల కష్టము సుమా.

లక్ష్మ—అన్నా తమరే కష్టములకోర్వ నే నోర్వజాలనా? వచ్చెదను.

సీత—(తనలో) నానాథుడు నన్ను విడచి కాననభూమికి బోయెదరు గాబోలు! నా నాథుని బ్రార్థించి పదసేవజేయ నీ దాసురాలిని దోడ్కొనిపోవునట్లు సెలవు కోరెదను. (ప్రకాశముగ) నాథా మీదాసురాలిని నైతము గొని పోవ బ్రార్థించెద. దేవరవా రనుగ్రహింతురుగాక. (15 అనుబంధము)

రామ—దేవీ. (16 అనుబంధము)

సీ॥ కఠిన కంటకమయ ♦ కాననంబులెగాని
జనులుండు పట్టణ ♦ సమితిగాదు
శరభ శార్దూల ని ♦ ర్ఘర నాదములెగాని
పరువగు శుకపిక ♦ ధ్వనులుగావు
కంద మూలాదుల ♦ గాల్చి తినుటెగాని
షడ్రసోపేతాన్న ♦ సరణిగాదు
చీకాకు నుండు ♦ చెట్టుచేమలెగాని
వర్ణింప కేళికా ♦ వనముగాదు

తే॥ గీ॥ పడఁతి నీ నేడ యడవుల ౹ వడచు టేడ
బడలెదవు జుమ్మి యచ్చట ౹ నడుగు లిడఁగ
మగుడివచ్చెద గడువు వే ౹ మరలి చనఁగ
భామ! నీమది గగ్గోలు ౹ పడక నిలుము॥

మరియు నో భూజాతా! జలజమిత్రుని ఘాతలకును సలిలధారల చలికిని నోర్చి చరించవలయు గాన నీ విప్పట నే దాసదాసీ జనంబులతో నుండుము.

సీత—నాథా.

సీ॥ న్యాయమా యిది సాంద్ర ౹ దాయమా సతిబాయ
శ్రేయమా నీకిది ౹ శ్రీనివాస
నేరమా యిటుజూడ ౹ భారమా నామీద
వైరమా నీకు నో ౹ వనజనయన
చందమా కనుల కా ౹ నందమా యిది జనా
నందమా నింద నా ౹ కుం దనర్ప
కోపమా నా సేయు ౹ పాపమా కృపజూపు
నాపయి, నన్ను మీ ౹ దాపు శేర్చి
తే॥ గీ॥ ధైర్యమును వీడనిప్పుడు ౹ గార్యమౌనె
జాలమేలను? జనకభూ ౹ జాతకిపుడు
హర్షమున వెంటవచ్చెన ౹ గ్లానతిమ్ము
రామ రఘురామ పట్టాభి ౹ రామనామ!

రాము—దేవీ! యేమి యిట్లుకోరెదవు? ఇత సాహసము చెల్లునా?

సీత— ద్వి॥ ఓ రాజరాజేంద్ర ౹ యో రామచంద్ర
ఈ రామ నిటువీడు ౹ టెట్టిన్యాయమ్ము.

రాము— జానకీ! యిటులాడ ౹ సరసమే భువిని,
కానన దిరుగాడఁ ౹ గారాదు స్త్రీలు.

సీత— అగ్నిసాక్షిగను న ౹ న్నమరుల యెదుట
లగ్నంబునందు ఘా ౹ లాక్షునివిల్లు
విరచియు బెండ్లాడి ౹ వేడ్క నయోధ్య
పురి శేర్చియిటువీడి ౹ పోవంగదగునె.

రాము— నీ నుడి సత్యమే ౹ నిన్ను నే వనికి,
మానిని! కొనిపోవ ౹ మనసొప్పకుండె.

సీత— మిమువీడి భూజాత ౹ మితిలేనిచింత
గాముక్రైన తనువు గోల్పోక మనునె.

కౌస— హా! సీత యిటులాడ ♦ గా నోర్వగలమె
మాసన్నిధినినుండు ♦ మా ప్రాణధనమ
(రాముని జూచి) హా రామ! హా రామ! ♦ అయోధ్యాధ్యరామ
కారడవులకేరు ♦ కదలిపోయెదరె!
లక్ష్మ— అమ్మరో సెలవు మా ♦ కతి వేడ్కనొసఁగు
సమ్మతి బోదుము ♦ సత్కృపజూడు
దశ— నేను పాపుడ తండ్రి ♦ నీయెడ జాల
మానుగ కైకతో ♦ మంతనమాడి
నిన్ను గోల్పోయితి ♦ నిమిషంబులోన
దిన్నగా వనికేగి ♦ తిరిగి రమ్మిటకు
సుమిత్ర— రామ! లక్ష్మణ! సీత! ♦ రయమున దిరిగి
క్షేమమ్ముగా రండు ♦ క్షితినేలుకొండు
రాము— చిత్తము మాయమ్మ! ♦ శీఘ్రమె తిరిగి
వత్తుము నీదయ ♦ వలన నయోధకు
దశ— హెచ్చగ మీరలీ ♦ సీతతోగూడి
ఇచ్చటికే రండి ♦ హితమతి పండిరి!
కైకే—నాథా! యీ రద్దియేల? ఇంత వగచుచు మీరిచ్చు వరములు మాకేల?
తే॥ గీ॥ వరము లీయంగలేదని ♦ పల్కు చాలు
చాలు నంతియె సత్యంబు ♦ సాగిపోదు
బ్రతికియుండిన బలుసాకు ♦ బడసితినుచు
భరతునకును నేను వనికేగి ♦ బ్రతుకలేమె!
దశ—కైకా యింతపని జేసితివి. ఇంకను నీకోర్కె దీరలేదా?
రాగమాల

సీ॥ శ్రీరాగమున జిక్కి ♦ చింతసేయక కైక
కోరిన వరములు ♦ గొనుమటంటి
మోహనాకార! నీ ♦ ముద్దుమోమునుజూచు
భాగ్యహీనుండనై ♦ బ్రతుకనుంటి
భూపాల పుత్రుల ♦ పుడమినేలక వన
భూమినేలుమటంచు ♦ పోవుడంటి
తోడి వారలకగాటు ♦ దొరవలెనుండు ని
న్నరయఁగన్నులులేక ♦ నడలుచుంటి

తే॥ గీ॥ భూరికల్యాణమొదవంచని ♦ పురజనములు
సంతసించిరి యెంతలో ♦ వంతగంటి
భైరవీపతికృపచేత ♦ పరమపురుష
సుఖము చేకూరుమీ కటం ♦ జూచుమంటి॥

రాము—తండ్రి!

ఉ॥ అమ్మనుదూరకయ్య యిది ♦ యంతయు నావిధి కర్మమయ్య జూ
(తల్లులతో) సమ్మతి మాకు దల్లులరు ♦ చాలిన సాధ్వులు లేరుగాన చి
న్నమ్మను దూరకుండి మది ♦ వ్యాజముగానక యుండు డమ్మరో!
యిమ్మగ దమ్ముడే ధరణి ♦ నేలగజాలెడు పార్థివాసనన్॥

తలిదండ్రులారా! చిన్నమ్మయగు కైకమ్మగారిని మిగుల గౌరవముగా జూచుచుండుడు! ఆయుష్మంతుడైన నీసు జూపకుడు. అమా త్రేయ రాజపుత్రీ! భవదిచ్ఛానుసారముగా నెలవు సంగుము.

కైక—కుమారులారా! నావరములు చెల్లించుటచే నాయందార్ద్రిక్యము ఖ్యాతించుదురుగాక.

రాము—చిత్తము. పోయెదము జననీ—దేవీ, లక్ష్మణా! పోదమురండు.

కైక— గీ॥ కుర్రి లక్ష్మణ! కైకేయి ♦ కూళయనుచు
కినుక బూనకు సుఖము మీ ♦ కును ఘటించు
(సీతపై చెయివైచి) నేడు మాయత్త కైకేయి ♦ చూడలేక
మిమ్ము పనికంపెనంచని ♦ మదిం దలంపకు॥

భూజాతా! సుఖముగా పోయిరమ్ము.

సీత—చిత్తము.

(అని అందరు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము సంపూర్ణము.





శ్రీ

# సంపూర్ణ రామాయణము.

## తృతీయాంకము.

ప్రథమరంగము - కైక అంతఃపురము.

(భరత, శత్రుఘ్న, వశిష్ఠుల ప్రవేశము.)

భర—ఏమీ? పట్టణరాజమంతయు శోభదఱిగి వెల్వెలబాఱియున్నది. రాజమార్గము లన్నియు భీతిదాయకంబున కాలవాలమై యొప్పుచున్నవి. నగరియం దెచ్చట జూచినను మంగళతూర్యధ్వనుల సవ్వడిలేక కాళరాత్రివలె నిశ్శబ్దముగ నున్నది. ఏమికతమై యుండునో? మాతల్లి నారసి గ్రహించెదగాక!

(కైక ప్రవేశము.)

భర—తల్లీ! పట్టణ మిట్లుండుటకు గారణమేమి చెప్పుమా.

కైక—కారణమా.

చం॥ వరములు రెండు, నీగురుడు ♦ వైభవలీల నొసంగె పూర్వ మీ
దిరమతి నవ్విగోరుట కి ♦ దేతరి, నిన్నిట పట్టభద్రుని౯
సరసుల రామలక్ష్మణుల ♦ సత్వర కాననసలమందు సు
స్థిరముగ మన్వవర్షముల ♦ దిమ్మరఁ బంపుమటంచు, వేడితి౯॥

ఇట్లు కోరియుంటిని. అందులకు మీ తండ్రిగా రంగీకరించి సీతా రామలక్ష్మణుల నరణ్యమునకు బంపిరి. వారు పోయిన సప్తదివసంబులకు మీ తండ్రిగారు దివికేగిరి. ఇప్పు డిప్పట్టణ మేలనేలిక లేక యరాజకమై శోభ దఱిగియుండె. నా వరద్వయము నొందుదిరి. ఇంక రెండవది నిన్న రాజ్యాభిషిక్తుని జేయుటకు మిగిలియుండె. రాజ్య మిట్లరాజకంబుగా నుండరాదు? కావున నీవు సత్వరము రాజ్యభారమును గ్రహింపుము.

భర—ఓసీ! చండాలీ ?

(17 అనుబంధము.)

ఉ॥ నాలుక వ్రియ్యలెప్పుడగు । నాథునిజంపితి, వన్నవన్నెలన్
బాలను సీతనుం గవనికి । బంపితి విచ్చట యెట్లు నిల్చితో
తాలిమి రామలక్ష్మణుల । తాపసరూపెటుజూచిలేపు? మా
పాలిటి మృత్యుదేవతగ । వచ్చితి వక్కట మోటు రక్కసీ !
తే॥ గీ॥ సిగ్గులేక యీరాజ్యంబు । సేయుమనుచు
జెప్పుచుండిన నినుజూడ । జేతుగల్గు
మొండిరక్కసి! గదచేత । మొత్తి నిన్ను
విందుజేయుదు జూడుమీ । విహగతతికి॥

అయ్యో దైవమా! పరమ పాతకియగు నీకుకడుపున జన్మించుట నా పురాకృత కర్మమేకదా? ఓసీఘాతకీ! యింత కార్యంబుజేసి యిందరి యెదుట నెట్లు దలయెత్త సాహసించితివె?.

చ॥ బుధులగు రామలక్ష్మణుల । భూసుర పూజ్యుల, వీడి నేనటుల్
పదపడి యిట్టయోధ్యపురి । పాలనజేయఁగలాడ? యీదిశా
కధ గనలేక ఘోరతర । కార్యముజేసినదాన వైతివే,
మదమున కన్నుమిన్నుగన । మర్మముబెట్టితి వోసిరక్కసీ॥

ఓసీ! నీవు నాపాలిటి ననుభూతమవుగాని తల్లివిగావు? నీ తనువు నీ కరవాలముచే ఖండించెద జూడుము. (నరకబోవును).

శత్రు—(అడ్డమువచ్చి)

(18 అనుబంధము.)

తే॥ గీ॥ శాంతము వహించు మోయన్న, । శౌర్యమూని
అమ్మ నిటుజంపు టన్యాయ । మార్యవినుతి!
మాతృవధదోషము లభియించు । మనకు గాన
నిట్టి క్రూరకార్యము సేయు । టేల? వలదు.

అన్నయ్యా! నామనవి నాలకింపుడీ! ఇకార్యమునకు సాహసించిన రామచంద్రుఁడు మాతృహంతకులమగు మసలజూడ నిచ్చగింపడు.

కైక—నాయనా భరతా! నీకుగాను

మ॥ పసుపుం గుంకుమ బాడుసేసికొని నే । పాపంబు నార్జించితిన్
వసతుల్ శూన్యముగాగ నేనిపు డవా । ర్యంబైన నిందల్ భోకీ

వసమీారంగ వహించి తిప్పగిడ, నా ♦ ప్రారబ్ధమిట్లయ్యెం గా
గసవృక మేయగబోయె బుద్ధిలామి, దుః ♦ ఖంబొంద నేమయ్యెడుక?

అయ్యో? మంథర దుర్బోధలచే నాకెట్టి సంకటములు కలిగినవి? పీని మోప్రిలనిలిచితినేని నన్ను ఛ్రితుకనీయడు. నే వేగమ చని కౌసల్యాదేవి పాదములపైబడి నన్ను క్షమింప వేడుకొనియెద.

గీ॥ పరుల సౌఖ్యంబులనుజూచి ♦ పాపమతులు
గీడు సేయంగజూతురు ♦ గూఢముగను,
దాన నాశమ్మగల్గు, త ♦ థ్యమ్ము, గార
వమ్ము, కీర్తి, సుఖమ్ము, పు ♦ ణ్యమ్ము సుమ్ము॥

నే నిప్పుడేపోయి కౌసల్య నాశ్రయించెద. (నిష్క్రమించును.)

**భర**—మాయన్న కానల కేగు కాలమున నన్నెంత దూరెనో కదా! నేనెట్టు లాతని గాంతు? క్రోధస్వామియగు లక్ష్మణస్వామి నాపై నెట్టి యాగ్రహము జూపుచుండెనో? ఎట్లయినను నరణ్యములకుంజని సీతారామలక్ష్మణుల బ్రార్థించి మరల పురప్రవేశము గావించెద. తమ్ముడా? సుమంత్రామాత్యాది పౌరులకొందర నాయత్తపరచుము. నేను కౌసల్యాదేవి కడకేగి ఆయమ సెలవునొంది వచ్చెద. అయ్యో దైవమా? కౌసల్యాదేవి నన్ను జూచిన తోడనే, పట్టభద్రుడా, వచ్చితివాయని శిరమునేలవైచుకొనవల సినదేకదా? హావిధీ! పురజనులెల్లరు నన్నెంతె దూరుచుండిరో కదా! యెవరెట్లనుకొనిననేమి? సర్వాంతర్యామియగు శ్రీరాములకే సర్వము దెలియును. సోదరా! సుమంత్రాది మంత్రులను నింక కొందర పురజనులను ముందు నడిపింపుము.

**శత్రు**—చిత్తము. (నిష్క్రమింతురు).



ద్వితీయ రంగము—చిత్రకూటప్రాంతారణ్యభూమి.

(సీతా రామ లక్ష్మణులు నారచీరలతో ప్రవేశము.)

(19 అనుబంధము)

**రాము**—తమ్ముడా లక్ష్మణా! యీపుడమిజాత కమడవ్వ నడుచుటచే నొడలుబడలి తనువు తెలియక నిదురించుచున్నది చూచు? కనుక నే నిద్ర సుఖమెమ్ముంగదని నుడివెదవు?

సీ॥ అంతఃపురంబుల ♦ నలరెడు సీతన్వి
కాంతారభూముల ♦ గ్రిందవలసె
కనకాంబరంబులు ♦ కట్టుచుపూబోడి
వల్కలములధరిం ♦ పంగవలసె
హంసతూలికపాన్పు ♦ నందు బండెడు సాధ్వి
కరకునేలను నిద్ర ♦ గాంచవలసె
పంచభక్ష్యాన్నముల్ ♦ భక్షించు భామిని
కందమూలములతో ♦ కుందవలసె
తే॥ గీ॥ నరుణకాంతి మెరుంగని ♦ యతివనిన్న
మండుగాడ్పు టెండలో ♦ నుండవలసె
చెలుల గానంబులకు సంత ♦ సిలెడుచాన
ఝిల్లికాధ్వనులకు నుల్ల ♦ సిల్లవలసె॥

లక్ష్మణా! పాప మింకను మేల్కాంచియుండలేదు. నడచుటవలని శ్రమ చేతనేక దా? (పైనజూచి)

సీ॥ పూర్ణేందువదన నీ ♦ భూపుత్రిగాదకే
జగముబ్రోచెడి సూర్య ♦ చంద్రులార
జనకరాట్పుత్రి నీ ♦ సాధ్విబ్రోవరే
యతికృపారసముంచి ♦ యమరులార
దశరథుకోడలి ♦ దన్విఁబోషింపరే
వనవాసులౌ మునీ ♦ వర్యులార
రాముని దేవేరి ♦ రక్షింపగాలేరె
శీలంబుగల్గు ది ♦ క్పాలులార
తే॥ గీ॥ నగములార! సుభారవ ♦ ఖగములార
భిల్లదారలార! లతామ ♦ తల్లులార!
యడవిజనులార! మోరాజ ♦ హంసలార!
కావరే సీత నిటమీద ♦ కనికరమున॥

లక్ష్మ— అన్నయ్యా! సర్వసుఖము లనుభవించు ఈ జనకజ యిగుల సుకుమారి యగుటచే కష్టముల కోర్వజాలక యిట్లు బేలయయ్యె? (ఆకసమువంక జూచి) అన్నయ్యా! అటు జూడుడు.

(సీత లేచి కూర్చుండును.)

గీ॥ ధూళి దశదిశలను నిండె ♦ దోహదముగ
వినగనయ్యెడు కలకలా ♦ వేశరవము

శత్రులెవ్వరో భాగాగ్ని • భావ, గ్రొవ్వి
వచ్చుచున్నటు దోచ నీ • వనమునకును॥

(మరల దైకిజూచి) అన్నయ్యా! నిక్కముగా నిట్లె జరుగునని నిశ్చయించితిని.

సీత—మరదీ, లక్ష్మణా?

గీ॥ తిండియును నిద్రయును లేక • యుండునీకు
నిట్లు విపరీతముగ దోచు • నేమొకాని
నీవు వచియించినదిచూడ • నిక్కమనుచు
బుద్ధి దలపోయజాల నో • ముద్దుమరది॥

లక్ష్మ—అమ్మా జానకీ! మీరిట్లు సెలవీయవలదు. నిక్కముగా శత్రువు లెవ్వరో వచ్చుచున్నారు. (అని నలుదెసలుజూచి) తెలిసినది, తెలిసినది. అన్నయ్యా! యేమి యీ కాలమహిమ? (20 అనుబంధము.)

ఉ॥ పన్నుగ మింట నుత్తరపు • వైపున నెర్రని ధూళిగప్పె జూ
కన్నన కైకజుండు, రణ • రంగమునన్ మనలం జయింప న
త్యున్నత సైన్యసంఘముల • నొయ్యన తోడ్కొనివచ్చుచుండె నో
యన్న! యనుజ్ఞ నిమ్మతని • నాహవభూమిని ద్రుంతు జయ్యనన్॥

అన్నయ్యా! వానికేమి యుపచార మొనరించియుంటిమి? రాజ్యరమను ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలుకొమ్మనినను వానికిమనఃవిసనక మనల జంపనెంచి వచ్చుచుండె. కానల బ్రతుకుచున్నను నీ దుష్టాత్ముడగు భరతుడు మనల బ్రతుకనిచ్చునట్లు లేదు. దేవా! వాడు రాజ్యమేలు సమయమున మనమున్నయెడల మనలచే నెట్టి హీనకార్యముల చేయించుట కుపక్రమించునో కదా? అన్నయ్యా! భరతుడు నీచస్వభావుడు తో ముచ్చటించుటకైన నిచ్చగొనడని పలుమారు బలికియుంటిరే? ఇప్పటికి వాని చరిత్రమంతయుం దెల్లమయ్యెనా? అయిన నిప్పుడు మిగిలినది లేదు.

రాము—తమ్ముడా! కోపోద్దీపితమానసుండవగుటచే, గ్రుడ్డివానికిజగంబంధకారబంధురంబైనట్లు, భరతుని నిర్మలమనఃపద్మము గుర్తెరుగక విపరీతముగా బల్కుచుంటివి. ఎన్నిసారులు వలదన్నను క్రోధమును బెంచుచుంటివిగాని తగ్గించుట లేదు. లక్ష్మణా! యిదియే కడసారి మాట! యిటువినుము?

చ॥ భరతుని, ధర్మవర్తనుని • భవ్యచరిత్రుని భక్తియుక్తునిన్;
బరుసము లాడుచుంటి విది • భావ్యమె పాపముకాదె లక్ష్మణా!
ధరణిని నాకొసంగుటకు • దాన్నిట వచ్చుచునుండె బ్రాన్ధన
బరువడిసేయుచున్ హృదయ • పద్మమునన్ ననునిల్పి భక్తితోన్॥

లక్ష్మణా! శాంతివహింపుము. మరియు నేటి ప్రభాతమునగనిన స్వప్నమందు మన భవనమంతయు భస్మమైనట్టును పరివారమెల్ల సమసిపోయినట్టును నమంగళములం గంటిని. ఇందలి చెడుగులు వెంటనే ఫలించునని తోచుచున్నది. (అనిదీనతం జూచును)

సీత—నాథా! ధైర్యమూనుడు. పరమేశ్వరు డీ యమంగళముల వమ్ముచేయుగాక!

లక్ష్మ—ఈ స్వప్నఫలములు పుత్రశోకమున మునింగిన తండ్రిగారిపై బారవుకదా? భరతుం డిటే వచ్చుచున్నవాడు. అన్నయా! భరతుకు వచ్చులోగా ప్రాతఃకాల కృత్యంబులం దీర్చుకొనుటకు నదీతీరమునకుంబోందము.

రామ—అట్లనే చేసెద? నేడేలకో నామానస మతిశోకమును బొందుచున్నది. కారణ మేమైయుండును.

(నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము - అరణ్యము .

(కైక, కౌసల్య, సుమిత్ర, భరత, శత్రుఘ్నులు, పౌరులు ప్రవేశము.)

భర—అమ్మా కౌసల్యా!

సీ॥ అపరంజిగద్దెపై ♦ నధివసించెడువాడు
దర్భాసనంబున ♦ దనరుచుండె
పీతాంబరములచేం ♦ బెంపుగొప్పెడివాడు
వల్కలధారియై ♦ వరలుచుండె
సమహంసతూలికా ♦ శయ్య నుండెడివాడు
కఠినంపు నేలపైం ♦ గ్రాలుచుండె
నమృతాన్నరసముల ♦ నారగించెడివాడు
కందమూలములతోం ♦ గడుపుచుండె

తే॥గీ॥ నడవులందున దిరుగాడ ♦ నరిగె బడము
లట్టి సుఖభోగి నిటుచేసె ♦ కట్టిడివిధి
యొండసోకున కసుగంది ♦ యుండె మోము
కాల విపరీతమున గష్ట ♦ కాలమబ్బె॥

అహో దైవమా! నన్నెంత పాపినిగాం జేసితివి. నా సోదరుని యిడుముల జూచుచు జీవించవలసివచ్చెంగదా?

(లక్ష్మణుడు ప్రవేశము.)

లక్ష్మ—(భరతుని కౌఁగలించుకొని)

తే॥ గీ॥ నీ స్వభావము గనలేక ♦ నేనుమిగులఁ
దిట్టితిని, జంపఁబూనితి ♦ చెట్టనగుచు
నీసువృత్తముఁ గనుగొంటి ♦ నింకమీఁద
నాయొనర్చిన తప్పులె ♦ న్నకుము భరత॥

సోదరా! అగ్రిహాగ్రిహామూవరించి మేనుమరచి నీయందపచారము నెంచిన యీ మూర్ఖుని క్షమింపవలయు.

భర—అగ్రజా! లోకోద్ధారకులగు మిమ్ము నిట్టి కష్టముల గల్పించిన నన్ను మీ శరధారలచే దుఃంపక నన్నే క్షమింపుమని పల్కుచుంటిరా? (అని పదములపై బడును.)

(రాముడు, సీత ప్రవేశము.)

భర—అన్నా! నమస్కారము

(21 అనుబంధము.)

గీ॥ లేశమైన దుర్దోషంబు ♦ లేదులేదు
నీపదాబ్జములే నమ్మితి ♦ నిక్కముగను
దాసుఁడొగిఁజేయు తప్పులు ♦ దండమిడఁగ
దీరునను సామెతను మీరు ♦ స్థిరపరుపగ॥

దేవా! మాతల్లి యొనరించిన కార్యమే నెరుంగనైతి. నేనెరిగియున్న తమశిక్షకు పాత్రుడ

రాము—సోదరా! నీయందణుమాత్రమైన దోషము లేదని నే నెరుంగుదును. నీవంతగా జింతింపఁబనిలేదు. ఇపు డీ ఘోరాటవుల కేలవచ్చితిరి? మన జనను లేల సర్వాభరణవర్జితలై కన్పట్టుచున్నారు? తండ్రిగారికి కుశలమేగదా?

భర—(తనలో) అయ్యో! యేమిచెప్పుదును? (ప్రకాశ) అన్నయ్యా! పుత్రవియోగ దుఃఖభరముచే నాయనగారు దివికేగిరి.

రాము—హా! తండ్రీ. (మూర్ఛబడి కొంతసేపటికి లేచి)

గీ॥ పుత్రశోకభరమ్మున ♦ బుడమివీడి
స్వర్గమున కేగితొక్కొ యో ♦ జనక వేగ
నీవుమరణించుటాలించి ♦ జీవములను
ఘొండిన్న వేగఁదీరదే ♦ కుంటినకట॥

లక్ష్మ—అయ్యో తండ్రీ! పాపాత్ములమగు మమ్ము జూడ శంకించి స్వర్గము చేరియుంటిరా? హా! జనకా!

కౌస—నాయనా రామచంద్రా! మీతండ్రిగారు తమకు పూర్వమందు సంభవించిన శాపమును జెప్పుచు హా! తనూభవా! హా ఇనకులేశా! హా! రామచంద్రా! అనుచుమిగులశోకముతో బ్రాణముల విడచిరి

రాము—హా! తండ్రీ. దశరథేశ! (అని మూర్ఛిల్లును.)

వశి—కుమారా! రామచంద్రా!

చం॥ సలిలములందు బుద్బుదము ♦ చంచలమై నశియించునట్లు భూ
స్థలిగల జంతుసంతతులు ♦ జచ్చుచు బుట్టుచు నుండజూడవే
తెలియని వాని చందమున ♦ దీనతనొంది కృశించుటొప్పునే
మలినము నొందద నీమనసు ♦ మాన్యులు మెత్తురె చాలు రాఘవా!
రామచంద్రా! ధైర్యమూని ముందు నిర్వర్తించు కార్యముల నుపక్రమించుము.

రాము—చిత్తము.

సీత—అత్తయ్యా!

గీ॥ కానలకు వచ్చునప్పుడు ♦ కనకమయ వి
భూషణాంబరములతోడ ♦ బొలుచుమిమ్ము
గంటి పార్వతివలె; నేడు ♦ కట్టడివిధి
జూపె మిమ్మిట్లు విధివాత ♦ బాపగలమె॥
ఎట్టి బెడిదంపు టిడుములు సంభవించె హా!

కౌస—అమ్మా భూజాతా! యిట్లు విలపించెదవు? నిక్కముగా బాపాత్ములము మేమే. కాకున్న మీచెంతనుండు భాగ్యము లభింపకుండుటయు, హృదయేశు గోల్పోవుటయునా? ఇట్టివిపత్పరంపరల జిక్కిమిగుల విలపించుచుంటిమి తల్లీ!

వశి—కుమారులారా! మెంతకాలము చింతించినను పితృశోకము చల్లారదు. స్నాన మాచరించి పైతృకమున నుపక్రమించుడు.

రాము—

గీ॥ మానిచంద్రమ మీయాజ్ఞ ♦ మౌళిదాల్చి
జనకునకు నేను బురిసెదు జలమువినుమ

లక్ష్మ— తండ్రి నిన్నిపుడేరీతి ♦ ధన్యుజేతు
రగిలె శోకాగ్ని నామది రామచంద్ర॥

అయ్యో గురువరా! తండ్రిగారి మనోరథ మేరీతిగా దీర్పగలను!.

భర—అగ్రజా! నాయందుగల దోషములు క్షమించి తమరాక కెదురు చూచుచున్న రాజ్యభారమును స్వీకరింపవలయునని యీ దీనుని ప్రార్థన.

కైక—తండ్రీ రామచంద్రా! యీ దురాత్మురాలి దోషముల క్షమించి రాజ్యభారమును గ్రహించి మాపుణ్యము దప్పింపుము.

రామ—అమ్మా! తామిట్లు సెలవీయఁ దగదు. మాజనకుని మానస మేవిధమున దృప్తి నొందించగలను. చంద్రుని కొరకు నూలుపోగన్నట్లు వారియాజ్ఞ నెరవేర్చెద.

భర—అన్నయ్యా! నేనును మీ సేవజేయుచు వనములనుండెద.

వశి—కుమారా! అట్టి కార్యమునకు సాహసింపకు. నీకొక్క రహస్యము జెప్పెద వినుము.

గీ॥ రక్కసుల రూపుమాప శ్రీ । రాముఁడిపుడు
వనమునందున బదునాల్గు । వత్సరంబు
లుండవలెగాని నీవటు । లుండరాదు
రాము పాదుకలనుగొని । రాజ్యమేలు॥

నీ వధికభక్తుండవు. కాన శ్రీరామ పాదుకలంగొని సింహాసనంబునం దిడి నీవు యువరాజ్యాధికారము వహించి బూజనీయుంబుగా రాజ్యంబు సేయుము. ఇందుల కెవ్వరును మారుపల్కరాదు.

రామ—గురునాజ్ఞ కందరము బద్ధులమే కదా? (అని పాదుకలిచ్చును.)

(భరతుడు పాదుకల శిరముపై నిడికొని)

భర— (22 అనుబంధము.)

ఉ॥ రామునిపాదుకల్ గొలుతు । రాజ్యము సేయుదు మీయనుజ్ఞచే
బ్రేమముతోడ భూప్రజల । బిడ్డలరీతిగ బ్రోచువాడ శ్రీ
రాముని నామసంస్మరణ । రక్తినొనర్చెద నెల్లవేళలం
గామితముల్ ధరిత్రినిడగా । నదిగాకిక వేరెయున్నదే!

త్రిలోకాధ్యులగు నో రామచంద్రా? నీ పదదాసునకి సెలవొసఁగవేడుచుంటి.

రామ—మంచిది సోదరా! పురప్రవేశము గమ్ము.

భర—గురుజనులారా! పురంబున కరుగుదము. యిచ్చట జాగుచేయరాదు.

(అంత కౌసల్య, కైక, సుమిత్ర, వశిష్ఠ, సుమంత్ర, భరత, శత్రుఘ్నులు నిష్క్రమింతురు.)

రాము—తమ్ముఁడా లక్ష్మణా! మనయునికి పురజనులకు దెల్లమయ్యె. గాన యీదట మనమిచ్చోటనే యున్న పురవాసులు మాటిమాటికి మనల దర్శింపవచ్చి మన వ్రతమునకు భంగము గావింతురు. మన మిక దండకారణ్యము జేరి యొక కుటీరమును నిర్మించుకొని కాపురముందమురమ్ము.

లక్ష్మ—చిత్తము.

రాము—భూజాతా! పోదమురమ్ము.

సీత—చిత్తము (నిష్క్రమింతురు) (అవనిక జారును)

తురీయరంగము—పర్ణశాల, సీతారామలక్ష్మణుల ప్రవేశము.

రాము—తమ్ముఁడా లక్ష్మణా! పూజ్యుఁడగు జటాయు దర్శనము లభించినది. దుష్టులగు జంబుకుమారాది రక్కసులఁ బరిమార్చితిమి. ఇక నీ యరణ్యమందు రక్కసులున్నట్టు గన్పించదు. మన మీ పర్ణశాలయందు జానకిని బహుజాగ్రతగాఁ గాపాడవలయును సుమా!

లక్ష్మ—చిత్తము.

(అంత శూర్పణఖప్రవేశము.)

శూర్ప—(కోపముతో) నాకుమారుని బరిమార్చిన రాజాధముం డీ యరణ్యంబున గాపురంబుండెనని మునిజనులచే విని యీ యరణ్యమంతయు ద్రిమ్మరితిఁ గాని వానిజాడఁ దెలియదయ్యె! నాదుష్టుఁడిప్పుడు కనుపించిన తొలిముద్దగ గబళించెద! ఓరీ రాజాధమా! యెందుంటివిరా? (అని కేకలు వేసి నాల్గుమూలలు జూచి) ఈ ప్రాంతమున మనుష్యులున్నట్టు ఘ్రాణేంద్రియము చెప్పుచున్నది. నా యధముండే యిందు గాపురముండవచ్చు. అటుపోయి చూచెద. (రాముని సమీపించి) ఆహా! యేమి వీని సౌందర్యాతిశయము. వీనిజూడగనే దుఃఖమును, కోపమును దీరుటయేగాక! వీనిపై మోహ మగ్గలమగుచున్నది.

సీ॥ కమలదళంబుల ♦ కాదను కండ్లోయి
గన్గొనగల్గె న ♦ గ్గలపువలపు
చంద్రుని హసియింప ♦ జాలెడు నెమ్మోము
గన్గొన దమకు హెచ్చు ♦ గాటొడంగె
లతల సొరుకుమించి ♦ యతిమోదమిడు కేలు
గవ గన మరుకేళి ♦ గవయుదోచు
హరిమధ్యము సుగాంతి ♦ పరిహసించగఁజాలు
మధ్యంబుగన్గొన ♦ మమతఁగొలుపు

తే॥ గీ॥ కాంతులీనెడు నీదేహ • కాంతిఁజూడ
నింద్రనీలంబులను గెల్చు • నితనిసాటికు
మోహమగ్గలమయ్యె నా • బుద్ధియందు
వీనిఁగూడిసుఖించెద • వేయునేల?॥

(అని దగ్గర జేరి)

సురుచిరాకారా! నీ నివాసస్థానమెయ్యది? నీతలిదండ్రులెవరు? నీ నామధేయమేమి? పరిపూర్ణముగా నెరింగించితివేని పదపడి నా వృత్తాంతం బెరింగించెద?

రాము—మాదయోధ్యాపురంబు. తత్పురాధీశులైన దశరథేశ్వరుని తనయులము. ఈబిడ నాసతీమణి మమ్ము సీతారామలక్ష్మణులందురు. ఇదియె మా వృత్తాంతము.

శూర్ప—రాజా! నేనొక రహస్యమెఱింగింతు వినుమా?

రాము—వినఁదగిన రహస్యమైనచో నట్లనే వినియెద.

శూర్ప—నేను

చ॥ బలిమిని బట్టి దేవతల • బాములఁబెట్టెడి దైత్యభర్తకున్
జెలియలఁ; బేరుశూర్పణఖ • జెప్పెడిదేమియు లేదు గాని నీ
చెలిమినిఁగోరి వచ్చితిని • చేరగరమ్మిక నీవనంబులోఁ
గలిసి సుఖంబు గాంచుదము • కాలము బుచ్చుట యింక భూవరా!

(అని పట్టుకొనబోవును)

రాము—ఆ. ఆ. ఛీ. ఛీ. (అని తొలఁగును)

శూర్ప—రాజా! నన్నుఁ గూడితివేని యెల్లవిధముల నీకు మేలొనఁ గూర్చగలవాఁడను ఖరాసురుఁడిటనే యధిక సేనాసమేతుండై యుండె. నీ విట్లొనర్చితివేని నేను నీవియ్యమొందుదు. (అని చేయి బట్టుకొనబోవును.)

రాము—ఛీ. నాదాపుజేరకు (అని తొలఁగును)

శూర్ప—ఓయీ!

ఉ॥ రూపమునందు మేల్మిగల • రూపసి నన్ను వరింపుమింక నీ
పాపపు జాతిమానిసిని • బాయుము జాగొనరించితేని సం
తాపముగల్గునమ్ము త్వరి • తంబుగ నీచెలి సోదరున్ విడిః
గోపము బెంచి మింగెదను • కోరికఁ దీర్పగ రమ్ము వేమఱన్!

నీసోదరుని నీయాలిని మాటుమాయఁజేసెద! ఇందుకు సమ్మతించుము. పదపడి యేకాంతమున మదన కళాకలాపముల మనముల జొన్ని సుఖింతము.

రాము — శూర్పణఖా!

గీ॥ అన్నివిధముల మేలుల ♦ నున్న నీవు
కోరినటులైన నతఁడు చే ♦ కొనును నిన్ను
మన్మథక్రీడలను దేల్చి ♦ మనుచుఁగాన
నీకుఁ దగుజాణయాతఁడే ♦ సత్యముబల॥

కావున! నట్టి రూపవయోలావణ్య సుగుణములు గల లక్ష్మణ కుమారుని గోరుము.

(అంత శూర్పణఖ లక్ష్మణునిచెంతకుబోయి)

శూర్ప — బావా లక్ష్మణా! వింటివా మీయన్నగారిమాట!

లక్ష్మ — ఓసీ రక్కసీ!

ఉ॥ మూడు జగంబులందధిక ♦ పూజ్యుడు రాముఁడటంచు బల్కుటల్
చేతనో నీవెఱుంగవె వి ♦ శేషము నా వరియించె దేలనే,
పోడవటంచు నందముల ♦ పోవు నటంచునుగాంచి యాతఁడున్
గాఢపుప్రేమ నిన్ వలచుఁ ♦ గా నదిగానక యిట్టుబల్కెదా॥

కావున నో శూర్పణఖా! నిన్ను రాముఁడు గోరి యుండుటచే నాకు వదినవైతివి గావున మారుబల్కక రాముని కడకుం జనుము.

సీత — (నవ్వును).

శూర — గీ॥ నన్ను గన్గొని నీవిట్లు ♦ నవ్వ యేల?
సరసమెఱుఁగని దుట్టి నా ♦ సవతి నీకు
పొగరు కనులకు నెక్కె జు ♦ మ్మగణితముగ
మ్రింగెదను జూడుమో సీత ♦ మిట్టిపడకు॥

(అని సీతపై బడ రాముదు పట్టుకొని తమ్మునిజూచి)

రాము — లక్ష్మణా!

క॥ క్రూరులు దుష్టాత్ములు నగు
వారలతో నర్మ బల్కుట ♦ వలదెప్పుడు ని
ష్కారణముగ నేరము లిడి
యీరామను మ్రింగజూచె ♦ నిటు క్రోధమతిన్॥

ఇట్టి మిట్టిపాటుగల యీరక్కసిని విరూపింజేసి పనుపుము. ఓసీ శూర్పణఖా! మా లక్ష్మణ కుమారుని వెంటజనుము నీకోర్కె దీర్చును.

లక్ష్మ — చిత్తము. రామసి రమ్ము!

(నిష్క్రమించి మరల వచ్చును)

శూర్ప—(ముక్కు చెవులు తెగి రక్తము తో) ఓహోరా! రక్కసులే మాయల మారులన్న రక్కసులనుమించి రాజులే మాయలమారులైరి? నన్ను నమ్మించి వంచించెనే? కానిమ్ము. వీరి పనిపట్టెద. వీరలజూడ కోపమును మోహమునుగూడ నన్ను పీడించుచున్నవే? అయినను గానిమ్ము. జగజ్జేయ ప్రతాపశాలియైన మాయన్నయగు రావణునకుజెప్పి వీరలపని బట్టించెద. ఇంక నా యాటలు వీరల మ్రోలసాగిరావు. జాగుసేయక యిప్పుడే లంకాపురికేగి మాయన్నను దర్శించెద.

(అని రామునిజూచి పండ్లు కొరుకుచు నిష్క్రమించును.)

రాము—తమ్ముడా లక్ష్మణా! రాక్షసాంగనం జూడుము. మింట నెట్లురుకుచున్నదో! యేమీ దాని మాయ! యింక మన మున్నంతవరకీ వనము చాయ వచ్చువా?

సీత—నాథా! ఆ పార్శ్వముజూడుడు. కురంగమెట్లు గంతు లిడుచున్నదో. ఆహా యేమి దాని ఠీవి?

(అనుబంధము).

గీ॥ చంద్రుడు ధరించు నిట్రికి ♦ శంభుచేతి
లేడికిని బుట్టినటువంటి ♦ లేగ యనగ
కనక కాంతిని మించి యీ ♦ కాననమున
చేర వచ్చుచునుండె బల్ ♦ చిత్రగతుల॥

నాథా! యెట్లయిన నాకాబంగారులేడిని బట్టితెచ్చి నాముద్దు చెల్లింపుడు.

రాము—దేవీ! యిది యెంతపని.

గీ॥ పట్టితెచ్చెద లేడిని ♦ ప్రోధమతిని
జూచుచుండుమి యిక మీద ♦ సుందరాంగి!
పరగ నాజంక చిక్కక ♦ పారువార
చయ్యనం దెత్తు నామృగ ♦ చర్మమైన॥

అచలాత్మజా! నీ వడిగిన వస్తువుదెచ్చి యిచ్చుట నాకు ప్రీతిన కావున యిప్పుడే తెచ్చి యిచ్చెద. అనుజా! లక్ష్మణా!

(24 అనుబంధము.)

గీ॥ దేవికోరిన కోర్కెల ♦ దీర్పవ్రతము
బట్టియుంటినిగ నా ♦ పయిడిలేడి
బట్టితెమ్మంచు వేడునీ ♦ పద్మగంధి
ముచ్చటం దీర్పగానిదె ♦ పోవువాడ॥

కావున నీవు జానకిని జాగ్రత్తగ జూచుచుండుము.

లక్ష్మ—అన్నయ్యా! యిది నిశ్చయముగా మృగమని తలంచి పోవుచుంటిరా?

చ॥ దనుజులు మాయబన్నెదరు ❙ తద్దయు దానిని గుంగజాల మో
మనుజవరేణ్యా! నామదికి ❙ మాయమృగంబని తోఁచెఁ జూడఁగాఁ
గనకమృగంబు నెంతదను ❙ కన్నది యెందును గాంచియుంటిమే
మనలను మోసపుచ్చ నిట ❙ మాయలుబన్నిరి రాక్షసాధముల్॥

అన్నయ్యా! మన మింత కాలమునుండియు వనములఁ దిరుగుచుంటిమి గదా? యిట్టి మాయలమారిమృగమును గనియుంటిమా? ఎవ్వరిచేనైన విని యుంటిమా? ఈ మృగము నిశ్చయముగా రాక్షసమాయయే సుమీ?

రాము—అన్నా! లక్ష్మణా! అట్లయిన,

గీ॥ పసిఁడిమృగము నిజంబైన ❙ బట్టితెచ్చి
యిచ్చెదను దేవికిప్పుడే ❙ యిచ్చదీరఁ
గాక మాయామృగంబైన ❙ వీకఁద్రుంచి
హాతమొనర్చెద జగమున ❙ కింపుగల్గ॥

కాన నేను వచ్చువరకు జానకిని భద్రముగా గాచియుండుము. అల్లదే పొదచాటునకు బోయినది. దానిఁ బట్టితెచ్చెద.

(అని రాముడు నిష్క్రమించును.)

సీత—(కొంచెముదూరముండి) మరదీ లక్ష్మణా! మీ యన్నగారింకను రారైరి. కారణమేమి? నాముద్దులేడి దొరకినదికాదు కాబోలు.

(తెరలో) హా! సహోదరా! లక్ష్మణా! చచ్చితి! చచ్చితి!

సీత—(తొట్రుపాటుతో) మరదీ లక్ష్మణా! వింటివా?

గీ॥ అలకించగ మీయన్న ❙ యార్తరవము
హా! సహోదర లక్ష్మణా ❙ యనఁగవినవె?
కీడు చేకూరె రాముని ❙ జాడఁజూడ
బొమ్ము రక్షింప శ్రీరామ ❙ భూపునిపుడు॥

లక్ష్మ—అమ్మా! రఘూత్తమున కేవిపత్తును చేరదు. వాసవపద్మజ రుద్రాదులైన నామహాత్ము నెదిరింపజాలరు. దనుజాధముండు కోలచే నేలంగూలి నన్ను బిలుచుచుండెగాని యా మహాత్ముని పల్కుగాదు ముమ్మాటికి నమ్ముము.

సీత—లక్ష్మణా! (25 అనుబంధము)

చ॥ దిగులు మనంబునందు లేదమి ♦ దీనత వేడ దయావిహీనతన్
బగతుని రీతి సూర్యకులు ♦ బద్మద భాష్పని చావు గోరితో
మగువలపాటి యోజనలు ♦ మానసమందు దలంచ వక్కటా
నగవక యెట్టులాగుదు న ♦ వారిగ దుఃఖము పొంగి పొర్లగన్॥

ఓయీ లక్ష్మణా! (26 అనుబంధము)

గీ॥ అనుజుడను నేనటంచని ♦ యధముడా కడు
రాజ్యసామ్రాజ్య సంపత్తి ♦ రహిని గోరి యె
కపటబుద్ధిని నీవిప్డు ♦ కానకటుల
నగ్రజుని చావు గోరితో ♦ యదనుగాంచి॥

ఓరీ కిరాతా! రాముడు గతించిన పిదప నన్ను గ్రహించ నెంచి నీయన్న క్షేమమారయకుంటివిగదరా. కపటహృదయా! కనుకనే పెద్దలు సవతుల బిడ్డలు పగవారని నుడివియుండిరి.

లక్ష్మ—శివ శివా! యెట్టి బెట్టిందపు వాక్యము లాలింపవలసివచ్చెను. (ప్రకాశముగా) అమ్మా జానకీ!

ఉ॥ తల్లివి నీవు నాకు, మరి ♦ తద్దయు నా గుణముల్ గ్రహింప కి
ట్టుల్లమునందు తామసము ♦ నూని ప్రలాపము లాడ జెల్లునే?
తల్లడిమందకింక గుణ ♦ ధాముని, రాముని, చెంత కేగి యా
సల్లలితప్రచారు నిటు ♦ చయ్యన దోడ్కొనివత్తు నమ్మరో॥

(27 అనుబంధము)

తల్లీ! ఈ ఘోరారణ్యమందు భీకరమృగములు పెక్కుగలవు. కాన వానిజూచి బెగ్గిలకుము. దానవు లనేకమాయలు పన్నెదరు. అట్టి మాయలకు లోనుగాక పర్ణశాలయందే యుండుము. నేను పోయివచ్చెద. సెలవొసగుము. తల్లీ! నే నీ యాశ్రమమున సప్తరేఖల గీచెదను. నీవా రేఖల మీరి వచ్చిన రామాజ్ఞ మీరినట్లే. నీవట్లు జరించితివేని మోసము వాటిల్లు. పద్మజ రుద్రాదులు వచ్చినను రాకుము. పోయెద. (నిష్క్రమించును).

సీత—హా దైవమా!

గీ॥ హరిణి యాచాయ రానేల ♦ నంతబట్టని
నేను బొమ్మననేల, న ♦ ద్దాని వెంట
దాను బోనేల, నంత నా ♦ దారవంబు
వీనులప్పుడ నేల నా ♦ పిదప విగనక
మనము నొవ్వంగ బల్కనా ♦ మరది చనియె॥

అయ్యో దైవమా! యినకులోత్తమున కేమియుప్వ చేకూరెనోగదా! లక్ష్మణుడు సైతము పోయియుండె నింకను వారురారైరి.

(28 అనుబంధము)

ఉ॥ రాముని బ్రోవ వేగముగ • రారె యహో సుర వర్యులార! మీ
రా మునిచంద్రపాలకున • యమ్మనతోడ్పడ రారె దిక్పతుల్
కామిత మిచ్చునావరుని • గావరె బ్రోవరె కాననమ్మునన్
దామసిలంగ నేనికను • తాల్మిని నిల్వఁగఁ జాల గావరే॥

అయ్యో దైవమా! పతిభిక్షబెట్టి నన్ను కావుము

(అని కన్నులుమూసి కూర్చుండును.)
(రావణుడు సన్యాసివేషమున బ్రవేశము)

రావ—జై, శంకర్ భగవాన్.
సీత—యతికులేంద్రా! వందనములు.
రావ—కల్యాణమస్తు! కల్యాణమస్తు! కాంతా.

ఉ॥ ఎవ్వతెవీవు? ఎందునికి? • యెవ్వడునాథుఁడు? కొంకివీడి నీ
వివ్వని కేల వచ్చితివ • దేమొకొ తెల్పుము కామినీమణీ!
క్రొవ్వున నిన్నుబట్ట మది • గోరిక జూతురు రాక్షసాధముల్
రవ్వన నాకు పల్కుము బ • ళీ విధి మెల్ల మరాళగామినీ!

సీత—అయ్యా! సంయమీంద్రా!

సీ॥ జనకభూమీశ్వర • తనయను నాపేరు
జానకియందురు • సన్నుతింప
ధర నయోధ్యాపురీ • ధాముడౌ దశరథ
క్ష్మానాథుకోడల • మానిచంద్ర
శౌర్యోన్నతుండగు • శ్రీరామచంద్రుని
యర్ధాంగినయ్య • సంయమివరేణ్య
తండ్రియానతి బతి • దండకాటవిలోన
ననుగూడి వసియించె • ననుజుతోడ

తే॥ గీ॥ కనకమృగమొండు గన్పడ • కాననమున
నేను గోరిననాథుండు • దానిబట్ట
నరిగె తడవైన తమ్ముండు • నరయఁబోయె
వారికాపద రాకుండ • వరములిమ్ము॥

తండ్రీ ఋషీంద్రా! యిట్లా బంగరు లేడిని బట్టబోవ హా! లక్ష్మణా! యను నార్తనాదము వినవచ్చె. వెంటనే శస్త్రాస్త్ర సమేతుండయి లక్ష్మణుం డన్నగారికి సంభవించిన ముప్పుం దప్పింపనేగియుండె. ఇంతవరకు రారైరి. త్రికాలవేదులగు తమ కెరుకపడని యంశముండదు. నా నాథుని జాడం దెల్పి నా చిత్తమునగల చింత బాపవేడుచుంటి. (అని నమస్కరించును)

రావ—(తనలో) ఆహా! ఇదియే మంచిసమయము. ఇప్పుడీ భూజాతను నరద ముపై నిడుకొని లంక కేగెద. (ప్రకాశ) సీతా! యిటువినుము.

చ॥ కలశభవుండు తాత గురు ♦ గస్త్యుడు విశ్రవసుండు తండ్రి నా
నిలయము హేమరత్నమణి ♦ నిర్మితమై వెలుగొందు లంక యీ
యిలగల దానవప్రతతి ♦ నింపుగ నేలెడివాండ ధారుణీ
స్థలినను మీరు బల్లిదుడు ♦ చానరో లేడట రావణాఖ్యుడన్॥

నీరూపలావణ్యము విని మదీయ సఖీజనంబులవిడి నీకొరకై వచ్చి యుంటి. మదనుం డదనిదియని పరితాప మొందజేయుచుండె. సఖీ! ఈ కాంతారంబున నీ రాజాధమునిం గూడి నీవేమి సుఖమనుభవించెదవు? రామణీయకములగు సమత్తుంగహర్మ్యములయందును, కుసుమితలతాకుంజ పుంజముల నీడను ముదమార విహరించుచు నాలంకయం దకలంకముగ సుఖించరమ్మా. రమణీమణీ!

సీత—(కోపముతో)

గీ॥ కమలజుని వంశమునబుట్టి ♦ ఘనతవీడి
యిట్టు బల్కెదవేలరా ♦ మిట్టిపడుచు?
హస్తిమశకాంతరంబొప్పు ♦ నరయ రామ
చంద్రునకు నీకుంజూడ రా ♦ క్షసవిహీన!

ఓరీ! నీవు మునివనినమ్మి తొందరగ నర్ఘ్యపాద్యంబులిడి మోసపోతిం గదరా?

రావ—సీతా! నా నిజరూపము జూడుము. (అని నిజరూపు జూపును.)

సీత—(మూర్ఛిల్లును) (యవనిక పడును)

పంచమరంగము - అరణ్యమందొక భాగము.

(రామ లక్ష్మణుల ప్రవేశము.)

రాము—అన్నా లక్ష్మణా! మీవదిన నొంటిగా విడచి యిట్లేల వచ్చితివి? అయ్యో! ఘోరారణ్యమున నాయింతి యేమయ్యెనోగదా?

సీ॥ రక్కసులజంపినార మ ♦ రణ్యమందు
వారలెక్కటి మాయల ♦ బన్నినారొ

జనక సుత కెట్టి యాపద ♦ సంఘటిలెనో
యొంటరిగ సీతనుంచి రా ♦ నుచితమగు నె?

లక్ష్మ—అన్నయ్యా! మీరా కురంగమును బట్టవచ్చిన కొన్ని నిముసములకు హా! లక్ష్మణా యను నార్తనాదము వినవచ్చెను. అట్టినాదము విని భీతిల్లి దేవి నన్ను మీ క్షేమమరయుటకై పొమ్మని పలికెను. నేను "త్రిలోకపూజ్యు లగు మాయన్నగారి కెట్టి యాపదయు చేకూరదు. ఇది యాంతయు రాక్షస మాయయని పల్కితి; నందులకామె సమ్మతింపక నన్ననేక రీతుల మిుల్కుల మించిన పల్కులు బల్కజొచ్చినది అందులకును మీయాజ్ఞ మీరినవాడ నగుదునని మిన్నకుంటి. అదిగాంచి దేవిగారు మీకాపద చేకూరినదని దుఃఖించుచు నోటవచింపరాని మాటయన్నైతము బల్కినది. అట్టి కర్ణకఠోర వాక్యములాలింపజాలక మీచెంత కేతెంచియుంటి. దేవరవారీ తప్పు క్షమించ ప్రార్థితులు. (అని నమస్కరించును.)

రాము—లక్ష్మణా! నా శౌర్యసాహసము లెరింగియు నాదేవి పొమ్మనినతోడనే వచ్చుట నీకు తగునా? స్త్రీలు భీతచిత్తలగుటచే ననేకవిధములఁ బల్కెదరు. ఇంతలో నీవడిగని యిట్లు సేయుటేల? మరచితిని. కురంగరూపధారి దనుజాధముఁడే. వాడు నన్నలయింపనెంచి చాలదవ్వరిగెను. అంత నేను నిక్కముగా రక్కసియని నిశ్చయించి వానిఁ బరిమార్చితిని. అన్నా లక్ష్మణా! సీత యేమ య్యెనోగదా? పర్ణశాలకు బోదమురమ్ము.

షష్ఠరంగము - పర్ణశాల.

(రామ లక్ష్మణులు పునఃప్రవేశము)

రాము—తమ్ముడా లక్ష్మణా! ఎట్టి యాపద చేకూరినది. ఈ పర్ణశాలయందు జానకిని గాంచమైతిమే! పిలువుము.

లక్ష్మ—వదినగారు! వదినగారు! జనకరాజతనయా! ఏదీ పల్కుటలేదే. శ్రీరామ మనోహారిణీ! తల్లీ!

రాము— సీ॥ కేతేఁడులేనట్టి ♦ తారాకథమభాతి
కారికలేని పం ♦ జరముకరణి
సారసహీనతా ♦ సారంబుపోలిక
గనదివ్వెలేని యిం ♦ గణముమాడ్కి
కుసుమఫలంబులులేని ♦ సుందరవనిగతి
పసిబిడ్డలేని భ♦ వనము కీతి

కలకంఠలతికలేని ♦ కమ్రమామిడితోట
నినుదులేనట్టి దు ♦ ర్దినముపగిది
తే॥గీ॥ భూరితరమార్దవములేని ♦ కార్ముకమువలెను
నాణెమగు తంతువు లేని ♦ వీణభంగి
జానకీదేవి లేనట్టి ♦ జాడఁజూడఁ
పాడుబారినటుండె నీ ♦ పర్ణశాల॥

అయ్యో లక్ష్మణా! యెట్టియాపద చేకూరినది! దుష్టదానవు లెవ్వరైన సీత నెత్తికొనిపోయిరో లేక క్రూరమృగంబుల వాతబడెనో యెఱుంగమైతిమి గదా!

సీ॥ హరిణాక్షి సీతఁ గా ♦ నఁబడిన గంటిరే
నమ్మకాడరె హరి ♦ ణమ్ములార
మదగజ గామినీ ♦ మార్గాన బోయిన
సరణిగాంచితిరె గ ♦ జమ్ములార
హరిమధ్య యిప్పుడీ ♦ తెరవునఁ జనినట్టి
క్రమ మెఱుంగరె మృగేం ♦ ద్రమ్ములార
కలకంఠ కంఠిని ♦ క్రీడ బోఁడగన్న ని
క్కమ్ము దెల్పరె పయి ♦ కమ్ములార
తే॥ గీ॥ కనికరమున జక్రస్తని ♦ చనినజాడ
గాంచినఁ జెప్పరు చ ♦ క్రమ్ములార
దయను భూజాత పోయిన ♦ దారిగనిన
సరగునఁ దెల్పరారె భూ ♦ జమ్ములార॥

హా! సీతా! యేమైతివి? రాముఁడేమి జేయునో యని యే లతలచాటున నైనఁ డాగియుంటివా? లక్ష్మణా! యీపార్శ్వమందు వెదకుదము రమ్ము. (కొంతదూరము నడచి) అయ్యో! యెంత వెదకినను గాన రాకున్నదే? హా సీతా! జనకజాతా!

సీ॥ ఈకాననలోఁ గాన ♦ నేకాన గననౌన
మీనలోచన సీత ♦ గాన నకట
యీవంక లేదాయె ♦ నేవంక కేఁగఁబోదు
పంకజాక్షిని జూడ ♦ నింక నకట
భూసుత నిమ్మహిఁ ♦ బ్రాకుర గలిగిన
వేసారి కట్లు జే ♦ వింతు నకట

(లక్ష్మణునిజూచి) కడగండ్ల పాల్జేసి • విడనాడి వచ్చితే
పుడమిజాతను జూడ • బోవ మకట

తే॥ గీ॥ అయ్యొ యింకేమిజేయుదు • నతివ నెట్టి
రక్కసులు మ్రింగిరో యిట • స్రుక్కలేక
పుట్టి నిలుజొచ్చెనో వన • భూమిలోన
తనువు విడనాడెనో కటా • తరుణియకట॥

ఆఁ యేమి! యీ రామునివెర్రి! అయోధ్యనుండి యడవులకు వెడలు నపుడే పుట్టినింటికి బొమ్మన నట్టిమాట జెవ్రులబెట్టనని పల్కనే! ఇట్టితరి యట్టి పని కొడిగట్టునా? వట్టిది వట్టిది. నిక్కముగా నేపాపిచేతనో మోస పోయినది? హా! సీతా! భువనజాతా! లక్ష్మణా! యిక నావైపున జూతము రమ్ము.

లక్ష్మ—చిత్తము. (అని కొంతదూరము నడతురు).

రాము—అయ్యో! యీ యరణ్యమందు నాసతి జాడ తెలిఁగించి నన్నూరడించు వారు లేరుగదా! హా! భూజాతా!

(29 అనుబంధము)

గీ॥ ఎండ మావులలోని నీ • రెంచ జూడఁ
గనులు మిరుమిట్లుగొలిపె నా • కలికిమిన్న
చెలియ నెడబాసి నేనట్లు • క్షితిని మనుట
తెప్పమాయన్న లక్ష్మణా • సీతజాడ॥

అనుజా లక్ష్మణా! సీతనుబాసి నేనొక్క నిముషమైన నిక బ్రతుకజాల.

లక్ష్మ—అగ్రజా! ధీనిధులగు తమకు జేలరీతి వాపోవ తగవుగాదు. ధైర్య మూనుడు. పిదప నీ కాంతారమందు సీతాకాంతను వెదకుదము.

(30 అనుబంధము).

రాము—ఇంకెక్కడిసీత? నెనుకు టెక్కడ?

(అని కొంతదూరము పోవుదురు)

(అక్కడ జటాయువు పడియుండును).

రాము—అనుజా లక్ష్మణా! చూచితివే?

గీ॥ జానకిని మ్రింగినట్టి యీ • దానవుండు
మనము వచ్చుటగాంచి తా • మ్రందినటుల
పక్షిరూపంబు దాలిచి • పడిన యితని
చంపెదనుఁ జూడుమీ యొక్క • శరముచేత ॥

(అని శరమెత్తును).

జటా—ఆర్తజనశరణ్యా! రామచంద్రా! నేను జటాయువనువాఁడ. మీజనకుండగు దశరథేశ్వరుని ప్రియసఖుఁడ. అయ్యా! మీరిరువురు నింటలేని యదనుగని రాక్షసాధముఁడు జానకిని తన యరదంబుపై నిడికొని పోవుచుండె. నట్టితరి నామహాదేవి యనేకవిధముల దైవమును గూర్చి వాపోవుచుండె. అప్పుడు నే నా యార్తనాదము విని నాయసురునితో ననేకవిధములఁబోరి వాని ఛత్రంబు మహీస్థలింగూల్చితిని. చాపము ద్రుంచివైచితిని. తురంగముల తుత్తుమురుచేసితిని. వానిరథమును రూపుమాపితిని అయ్యో రామచంద్రా! యిట్లాదనుజుని యనేక విధముల పరిభవము చేసితిని పిమ్మట క్రోధమానసుండై వాఁడిగల విశిఖంబుల నాపైఁబరపి నాపక్షముల ద్రెంచి సీతామహాదేవిని గైకొని గగనమార్గమునఁ జనియె. పక్షవిహీనుండనై రుధిరస్రావముచే మేనెల్లదడిసి యిచ్చటబడియుంటిని.

రామ—అయ్యా! ఖగకులేంద్రా! రక్కసివాతంబడి సీత నన్నేమనియెను? నాదనుజాధముం డెందుఁజనియెను? వానినామం బెద్ది? ఆదురాత్ముం డెవనిపుత్రుఁడు? వానిబలదర్పమేమి? సత్వరము జెప్పుము వానిని బట్టి యిప్పుడే ద్రుంచివచ్చెద.

జటా—అయ్యా! రామచంద్రా! వాఁడమిత వైభవసంపన్న బలాఢ్యుఁడు. వాని పేరు రావణుఁడు. సీతామహాదేవింగొని దక్షిణాభిముఖుఁడై చయ్యనఁ జనియె. వానిరూపము పదిశిరంబులచేతను నిరువది కరములచేతను జూడ భీతిగొల్పును.

రాము—పక్షిరాజేంద్రా! వాని వాసస్థానమెయ్యది?

జటా—రఘుకులేంద్రా! శతయోజన విస్తీర్ణమగు లంకాపట్టణము. వానిని సంగ్రామంబున దునిమి విజయలక్ష్మిం బడసి సీతాసమేతుండవై రాజ్యంబు పాలించెదవు. మనమున దిగులొందకుము. అయ్యో! ఈ యుదంతము నీకెఱిగింతమని యింతదనుక నా ప్రాణవాయుల నొక్కబట్టితి. కాని యిక మనఁజాల. నా మేన ప్రాణములు లేచిపోవుచున్నవి. రామ రామ రామ
(అని క్రిందపడి తిన్నఁగొనిచచ్చును.)

రాము—లక్ష్మణా! ఏమి యీ కాలవైపరీత్యము. అక్కరకు వచ్చువా[illegible] యాపదవచ్చుట?

సీ॥ జనకుఁడు చచ్చినట్టవగవ, జానకిఁ బాసిన వంతనొంద, నా
జనకుని మించుప్రేమగల చక్కని రాజ విహంగమక్కటా
దనుజునిచేతఁ జంపబడి తా దివికేగెను మీఁది కార్య మీ
ఘనుఁడగు పక్షిరాజునకు గాంక్షనొనర్చెద నగ్నిసత్కృతిః ॥

సౌమిత్రీ! మనకుపకారము సేయ నేఁచి మృతినొందిన యీజటాయుమృతి జూడ సీతావియోగమును మించియుండె. మనకీ పక్షీంద్రుఁడు దశరథుని యట్లె పూజ్యుండును మాననీయుండును. కాన నీ విహగేంద్రున కగ్ని సంస్కార మాచరించవలయు.

లక్ష్మ—చిత్తము! దేవరవారి యాజ్ఞ శిరసావహించెద.

రాము—లక్ష్మణా! పక్షీంద్రుని దహనభూమికి గైకొనిపోదము రమ్ము.

రామ — లక్ష్మ — (పక్షి నెత్తుకొని పోవుదురు).

(యవనిక పడును)

తృతీయాంకము సంపూర్ణము.







శ్రీ



# సంపూర్ణరామాయణము.

తురీయాంకము - ప్రథమరంగము.

ఋష్యమూక పర్వతము.

(హనుమంతుఁడు, సుగ్రీవుడు, కొందరు వానరులు ప్రవేశము)

(31 అనుబంధము).

సుగ్రీ—ఓయీ పవనాత్మజా! ప్రచ్ఛన్నవేషధారులగు యువకు లిరు బాణబాణాసనముల ధరించి వచ్చుచుండిరి. వారలీవనమున కేల వచ్చుచుండిరో యెచ్చటనుండి యెచ్చట కేగుచుండిరో? సత్వరమున గ్రహించిరమ్ము. వారిం జూడ చూడ వాలి పనుపున వచ్చినట్లు నాకు సందియము తోచుచున్నది.

హను—అయ్యా సుగ్రీవా! వారలు వాలి పనుపున వచ్చువారలుకారని తలచెదను.

సుగ్రీ—కానిమ్ము! వారలు నిజముగా మునులైనచో ప్రియమార నీవు వారలం గలిసి నాతో సఖ్యమగునట్లు చేయుము. పొమ్ము. నేనీగిరి గహ్వరమందు నివసించియుండెద. సత్వరమ రమ్ము.

(ఇద్దరు నిష్క్రమింతురు).

ద్వితీయ రంగము - నగప్రాంతము.

(రామ, లక్ష్మణ, హనుమంతులు ప్రవేశము).

హను—అయ్యా! రఘుకులేంద్రా! యీగహ్వరముననే కపికులేంద్రుఁడగు సుగ్రీవుఁడుండెను. రండు పోదము.

(సుగ్రీవుఁడు ప్రవేశము).

సుగ్రీ—ఆర్యులారా! వందన మాచరించుచున్నాఁడ.

హను—అయ్యా, కపీంద్రా! వీరలు

గీ॥ దశరథుని పుత్రు లినకులో । త్తములు జన్మ
రామ లక్ష్మణులను పేర । రాజిలుదురు
కర్మవశమున వచ్చి రి । క్కడికి వీరు
శౌర్యధనులయ్య మైత్రికి । సరసులయ్య॥

సుగ్రీవా! ధర్మజ్ఞుండును, సత్యసంధుడును, పితృవాక్య పరిపాలకుండును, నధికబలపరాక్రముండును, ఆశ్రితజనవత్సలుండును నగు ని రామచంద్రుని సఖ్యంబు గల్గెగాన నీ మనోరథంబు సఫలంబు కాగలదు వీరలు జనకాజ్ఞ నిలుప నడవికేతెంచి యుండుండ తనపత్ని రాక్షసాపహృతయైన కారణంబున నాసతికొరకు వనముల దిమ్మరుచుండిరి. వీరు మహానుభావులు. వీరి చెలిమిచే నీకు మేలు చేకూరు. ధైర్యమూనుము.

సుగ్రీ—అయ్యా రామచంద్రా! మీకును కాంతావియోగమే సంఘటిల్లినదా?

రాము—అయ్యా కపీంద్రా! నా దుఃఖమునకు మేరయే లేదు.

సుగ్రీ—ఇనకులతిలకా!

గీ॥ రావణుని యరదమునందు । రాజవదన
యొంటుభోరున నేడ్చుచు । నుండి తనదు
రత్నమయ విభూషణంబుల । రామచంద్ర!
చేలమునఁ గట్టివైచెమా । చెంతబడఁగ॥

అంత నే నానగల యుత్తరీయంబును భద్రపరచితి. దేవరవారి యనుజ్ఞయైన నా భూషణాంబరంబుల దెచ్చెద.

రాము—అయ్యా! కొసరమ్ము!

సుగ్రీ—చిత్తము.

(నిష్క్రమించి మూటతో బ్రవేశించి రామునకిచ్చును.)

రాము—(మూట చేతబట్టుకొని) అనుజా! లక్ష్మణా!

చం॥ జనకజ మేని భూషలివి । జానకిదాల్చిన యుత్తరీయమే
యనుజ గనుంగొనంగ మది । నాపగరాని వగల్ జనించె నా
దనుజునిచేత జిక్కువడి । దానినిబోవుచు భూషణావళుల్
తనమది గుందుచుఁ విడచె । ధారుణిపై గనుమింకతమ్ముడా!

ప్లవంగేశ్వరా! వాడేదిక్కుగబోయియుండె జెప్పుము? వానితల వ్రక్కలు జేసెద. సత్వరముగా బల్కుము. (కొంచెమూరకుండి) సుగ్రీవా! వాని నేవిధముగాఁ బరిమార్పగలము? మరల నాదేవి నెట్లుగాంతును?

సుగ్రీ—అయ్యా! దుఃఖించకుఁడు. వానిని రణమందు ఖండించి, భూజాతను దెచ్చెదను. ధైర్యమూనుడు.

రాము— గీ॥ నీవు కోరినకోర్కెల ♦ నేను దీర్తు
జానకిని దెచ్చుజాడల ♦ నరణిదెల్పు

సుగ్రీ— మీరునేనును గూడిన ♦ మేదినీశ
కష్టతరమైన కార్యము ♦ గలుగగలదె॥

సీతను దెచ్చియిచ్చు భారము నాయది మీరు చింతింపకుడు. దేవా! నా మనవి చిత్తగించుడు. (62 అనుబంధము)

మ॥ బలిమిన్నాసతి బట్టిదోచుకొని కో ♦ పంబూని కిష్కింధలో
పల నన్నున్వసియింపనీక వనికిన్ ♦ బారంగదోలెన్ మహా
బలుడా వాలి; యతండు చంపుననినే ♦ ప్రాణంబుపైఁ దీపిచే
నెలనాగన్ విడనాడియుంటి నకటా ♦ యీఋష్యమూకాద్రిపై॥

రామచంద్రా! యిట్టియిడుమలకు లోనై కులాంగనను బాసి, కుందుచుండిన యీ యనాధను గావుము. (అని పాదములపైబడును.)

రామ—కపిచంద్రా! నెమ్ము భీతిల్లకుము. దుర్నీతిపరుండగు వాలిని నా సితసాయకములచే ఖండించి నిన్ను కిష్కింధాపురమున కభిషిక్తునిగా జేసెద. ఎట్లయినను నీవు వాలిని గయ్యంబున కాహ్వానంబు జేయుము. జాగుసేయక కపిసేనతో కిష్కింధకుంజనుము. నేనును నీవెంటనే వచ్చి వాలిని దూలగొట్టెద.

సుగ్రీ—చిత్తము మహాప్రసాదము. (అందరు నిష్క్రమింతురు.)

(యవనిక పడును.)

## తృతీయరంగము - అగణ్యము.

(వాలిసుగ్రీవులు, శరములతోడను, రామలక్ష్మణులు చెట్టుచాటునను గన్పట్టుదురు.)

సుగ్రీ—ఓరీ! భ్రాతృద్రోహీ!

ఉ॥ ఆలిని స్వీకరించితివ ♦ హా! రణభూమికి రమ్ము సత్వరన్
గాలనశిమ్ముచే నిటులఁ ♦ గానలనుండితి నిన్నినాళ్లు నే
నాలముసేయవచ్చితి మ ♦ హాహవమందునఁ గెల్చిపొమ్ము నీ
కాలము దాపరించినది ♦ కాపురముండగ స్వర్గమందునన్॥

వాలి— ఓరీ!

ఉ॥ కానలడాగి డాగి వన ♦ కందములన్ దిని మత్తుమీరి యీ
కోనల నేడ్చి యేడ్చి మరి ♦ కొన్నిటికోతులఁ గూడివచ్చు మా
త్రాసను జెట్టిజట్టినని ♦ తాకఁగ నామది జంకుపుట్టునే
పాసలు లేక లేక నిసు ♦ బంపెదఁ గాలునిపట్టికిప్పుడే॥

ఓరీ! మాటలచే నేల గాలయాపన చేసెదవు? నీ చేవజూపుము. బాణ ప్రహారములు వచ్చుచున్నవి గాచుకొనుము. (అని బాణములు వేయును

సుగ్రీ—ఓరీ! నీ ప్రాణముల సంహరించితి. నిక నాయమ్ముల కమ్మదనము జూడుము.
(అని బాణము వేయును.) రాముడు చెట్టుచాటుననుండి బాణము వేయును)

వాలి—(క్రిందబడి) హా! మోసకారీ చచ్చితి, చచ్చితి. ఓరీ సుగ్రీవా! జననమైన పిమ్మట మరణ మెప్పుడైనను మన కెల్లరకు నిశ్చయము. కావున మరణమునకు సర్వజనులు సిద్ధముగా నుండవలసినదే కాని నా యారవ ప్రాణమగు

ఉ॥ అంగదు జూడుమింక కన ♦ కాంగదు సుందరమూర్తి పుత్రునే
బ్రోగుచు నంకమందునిడి ♦ పొల్పుగ ముద్దుల నాడుచుండు నీ
వుం గమనించి శైశవము ♦ బుచ్చుచు సంతసమొప్ప వాని నా
మంగళమూర్తి యా సుతుని ♦ మారునిమీరిన రూపవంతునిన్॥

అన్యాయము జేసితివిగదా. అయ్యా రామచంద్రా! యిట్టి నాపుత్రు నెట్లుబ్రోచెదరో మీరలే భారకర్తలు. కుఱ్ఱని వయసుతీరునరకు సుగ్రీవుని రాజ్యాభిషిక్తుని జేయుడు. పిమ్మట నా బుడుతడే గలడు. నేనదే ప్రాణముల విడుచుచున్నాడ. రామ రామ రామ (అని ప్రాణములు విడుచును.)

(యవనిక జారును.)

(అదేస్థలమున అంగద, లక్ష్మణులు ప్రవేశము)

అంగ—హా! తండ్రీ! భువనైకవీర!

ఉ॥ ఎత్తితి వెల్ల శైలము ల ♦ హీనయశంబుగ నేల నేలితో
మొత్తితివెల్ల శాత్రవ స ♦ మూహములన్ దగు కొండకొమ్మలన్
దుష్టునియుల్లగొట్టితివి ♦ దోర్బల లీలల బిరుదుగాంచితో
యిత్తెరి రామబాణమున ♦ నేగితొ స్వర్గము మమ్మువీడి యున్॥

హా తండ్రీ! జగత్త్రయైకవీరా!

గీ॥ చిన్నతనమునుండి నన్ ♦ ప్రేమచేత
పెంచితివి తండ్రి యిన్నాట ♦ ప్రేతభూమి
జేర్చగాబూని తక్కటా ♦ చింతలుడిగి
కటకటా? యెట్లుచేతు నీ ♦ కట్టడిపని॥

హా తండ్రీ! నిన్ను బాసి నే నొక్క నిమిషమైనను బ్రతుకగలనా? అయ్యో తండ్రీ! కపివీరా! (అని మూర్ఛిల్లును)

లక్ష్మ—అంగదకుమారా! బేలరీతి వాపోవుదవేల? యిట్టితరి మనమును రాయిజేసి కొనవలెగాని నీవుచేయదగునా? ఇక చింతింపకుము. నీతండ్రి రామాస్త్ర నిహతుడగుటచే నాకవాసప్రాప్తి జెందియుండెగాన నీ మనమున దిగులు ను వీడి నీతండ్రి కర్మకలాప మాచరింపుము. ఇక జాగు సేయకుమెమ్ము.

అంగ—చిత్తము. అట్లనే చేసెద. (అని లేచును. యవనిక పడును.)

---

తురీయరంగము – కిష్కింధాపురము.
(రాముడు లక్ష్మణుడు ప్రవేశము)

రాము—తమ్ముడా లక్ష్మణా! సుగ్రీవుడింకను రాడయ్యె. రాజ్యమత్తతచే స్త్రీలోలుడై మున్ను బల్కిన గడువుమాటయే మరచినాడు. నీవు కిష్కింధకుజని నావచనములు గనట్లనుము. (33 అనుబంధము)

చ॥ "తలపవు తొల్లి బల్కినది; ♦ తామరసాక్షులఁ గూడి మత్తతన్
నిలిచి యిటూలసించితివి ♦ నీదగు సేనలఁ గూడి రమ్ము నన్
దెలిసియు రానిచో వెనుక ♦ దీవ్రత వాలిని ద్రుంచినట్టి య
మ్ములు కలవాచు నమ్ముమెద ♦ బూనకు మూర్ఖతి వానరేశ్వరా!॥

బుద్ధిమంతుఁడవని నీకు నే నుపకారము సేయ గురుకార్యోచిత కాలమెఱుంగవైతివే! నాచెలిమి గాంచినను వానరబుద్ధి మానవైతివి గదా; రామప్రసాద రాజ్యగర్వాంధకార! యని" నాసందేశముగా బల్కుము. అందులకు సమ్మతింపకున్నచో నా కార్యమును నేనుదీర్చెద.

లక్ష్మ—చిత్తము అట్లనే బోయెద. (నిష్క్రమించును)

రాము—(తనలో) లక్ష్మణుడు వచ్చులోగా కాల్యకృత్యంబులు తీర్చుకొనియెద. (రాముడు నిష్క్రమించును)

(అదేస్థలమున హనుమత్సుగ్రీవ, లక్ష్మణ ప్రవేశము, పిమ్మట రాముడు ప్రవేశము)

సుగ్రీ—దశరథనందనా! శరణు శరణు (అని పాదములపై బడును)

రాము—ఓయీ సుగ్రీవా! రాజ్యమదాంధకారముచే కన్నుగానక చరించుచుంటివా?

సుగ్రీ—రామచంద్రా! మీకరుణాకటాక్షవీక్షణముచే నాకు సర్వసంపదలు చేకూర స్వామికార్యము దీర్చక యున్నకుందునా? కొంతవానరసేనను సీతాన్వేషణార్థము బనిచియుంటిని. మిగిలిన సేనను గూర్చుకొని నేను లంకకేగి రావణు సపుత్రమిత్రామాత్య పరివారముగఁ బరిమార్చి సకలకల్యాణగుణగణ సమేతయగు సీతను గొనితెచ్చెదను దేవరవారనుగ్రహింతురుగాక.

రాము—మంచిది. శీఘ్రముగా స్వామికార్యము సర్వరంపు. నేను సౌమిత్రియు మహేంద్రగిరియం దుండెదము.

సుగ్రీ—అట్లనే చేసెదము.

(రామలక్ష్మణులు నిష్క్రమింతురు)

సుగ్రీ—ఆంజనేయా! అంగద జాంబవంత సుషేణ గజగవాక్షులం గూడి దక్షిణ నీరధి లంఘించి లంకఁ బ్రవేశించి లోకమాతయగు సీతను వెదకుడు.

ఆంజ—చిత్తము సెలవొసంగుడు పోయివచ్చెదను.

సుగ్రీ—మంచిది. ఈ రెండుమాసములలో సీతను గాంచి శుభవార్త లెఱిఁగించుడు లేకున్న మీకు మానప్రాణములు దక్కవు.

(సుగ్రీవుడు నిష్క్రమించును)

ఆంజ—కపిపుంగవులారా! రండుపోదము.

వానరులు—అదెంతపని పోదము రండు.

(అని గంతులు వైచుచు అందరు నిష్క్రమింతురు)

(పంచమరంగము—సముద్రపుటొడ్డు)

(హనుమంత, అంగద, జాంబవంత, సుషేణాదులు ప్రవేశము)

అంగ—వనౌకసులారా! సీతాన్వేషణముకొరకు స్వయంప్రభా గుహాముఖంబు నేనాడు విడచితిమో యానాడే ప్రాణములపై యాశవదలుకొంటిమి. ఇప్పుడు మనము సుగ్రీవునిచెంత కేగితిమేని మనల బ్రతుకనీయడు. ఒకవేళ మిమ్ము బ్రతుకనిచ్చినను నన్ను బ్రతుకనీయడు. ఏలనన మాతండ్రియెడగల వైరముచేతను రాజ్యరమ నాకొసగవలెనను దురుద్దేశముచేతను నింక కొన్ని విషయములు మనమున దలచి యింతకూరకార్యము జేయుగాన నేనీ నీరధీ తటంబున బ్రాణంబులు విడిచెద. మీరు పొండు.

ఆంజ—అంగదా! యువరాజ్యపదవి నొసంగిన మీ పినతండ్రి సుగ్రీవుడు నిన్ను జంపునా? యేమీ నీ వెడగుతనము.

అంగ—అయ్యా! వాయుసూతీ! యేల నీ యోదార్పులు? సుగ్రీవుఁడు నన్ను నిక్కముగా యీమిషచే జంపును.

సుషే—కపులారా! మనము సీతనారయక ఱిత్త ప్రసంగములచే గాలము గడపి పురప్రవేశమైతిమేని, సుగ్రీవునిచే మరణము నిశ్చయము కాన యింక జాగుసేయక కార్యమునకు సాహసింతము రండు.

(అని ముందుకు నడతురు; సంపాతి ప్రవేశము).

సంపా—ఆహా! ఇక్కడ నేఁడెయో పెద్ద యాహారము దైవము నాకు చేకూర్చె. ఇంక నీ మృగముల నన్నింటి నొకదాని వెనుక నొకటి నాపొట్ట బెట్టుకొనియెద.

అంగ—వనౌకసులారా!

గీ॥ సీత వెదకుట యనుమిష ♦ చేత మనలఁ
ప్రాణములఁ దీయఁగా నెంచి ♦ పాపవిధి

ఫాల తలమున లిఖియించె ♦ పాపమనక
రామ లక్ష్మణులైన మ ♦ రేమిచేయు ॥

శ్రీరాముని వనవాసములచే దశరథుని మరణమును, సీతాపహరణముచే బక్షివధయు, వాలి మరణముచే సునకు జావును గల్గె. నిట్టి కెట్టిదంపు కార్యములన్నియు నైక కారణముననేగదా కల్గినవి.

సంపా—అయ్యా! మీరెవ్వరు? పక్షివధవయను చున్నారేమి?

అంజ—అయ్యా! మేము ప్లవంగేశ్వరులము. అయోధ్యా పురీశుడగు దశరథ తనయుండు రాముండు తండ్రిపనుపున కానకేగి కొన్నిదినములుండ సీతను రావణుడను రక్కసుడు దొంగిలె. దశరథసఖుడగు జటాయువు సీతాపహరణము జూడలేక రావణునితో బోరి చచ్చె. రావణుడు జానకిని యెందుంచినది వెదకుటకై రామసుగ్రీవులు మమ్ము పనుప నీ వనప్రదేశము లెల్ల వెదకుచుంటిమి. అయ్యా! పక్షీంద్రమా! సీతజాడ నీకేమైన దెలియునా?

సంపా—అయ్యా! జటాయువు చచ్చెనా? హా! సోదరా! మనమేల వంతము వహించవలెన? అయ్యో! నీ మరణవేళ నెంత సంతాపమొందితివో గదా! హా! సోదరా! నాకిక దిక్కెవ్వరు?

అంగ—అయ్యా పక్షీంద్రమా! చింతించకుము వంతమనుచుంటివే నేమది? జరిగిన వృత్తాంతమంతయు సవిస్తరముగా నుడువుము.

సంపా—అయ్యా! మేమిరువురము వంతిమూని గగనమార్గమున నడుచుచుండ భానుకిరణ జ్వాలలకు నాపక్షములు గమలిపోయి వింధ్యగిరి పైబడితి. అటబడి ననారుదినములకు నామూర్ఛ దెలసెను. అప్పటినుండియు నేను పుడమిపై పాకి లాకనేటికి జలధిదరికి జేరితిని. మున్ను నిశాకరుడను మునివరుండు జెప్పిన చొప్పున మిమ్ములగంటి. నింక మీకు సీత వృత్తాంతము జెప్పెద గావున నశించినగు నన్ను జలధియందు స్నానము జేయించి యిచ్చో కూర్చుండబెట్టుడు.

వాన—పక్షీంద్రమా! మహా ప్రసాదము.

(లోనికి దీసికొనిపోయి మరలదెచ్చి కూర్చుండబెట్టెదరు).

సంపా—(నాలుగువైపులజూచి) వానరులారా! రాము దేవేరియగు సీతామహాదేవిని లంకయందుగల యశోకవనమం దుంచినాడు. కావున మీరు నీరధిదాట ప్రయత్నింపుడు. రామనామస్మరణచే నాకు మరల యధాశక్తి కలిగినది. నేనేగెద (అని యెగిరిపోవును).

జాంబ—ఓయీ వానరులారా! మనకు గడువు సమీపించినదిగాన,

ఉ॥ ఎవ్వఁడు రామనామాజ్ఞ గ్రహీ ♦ యుంచి శిరంబునం దాల్చినట్టి వా
డెవ్వఁడు వార్ధిదాటి వడి ♦ నెవ్వఁడు లంకనుజొచ్చి బారు నిం
కెవ్వఁడు సీతజాడలను ♦ నింపుగఁ గన్గొనఁజాలినట్టి వాఁ
డెవ్వఁడు బోయిరాగలుగు ♦ నెవ్వఁడు జెప్పుడి జాగు సేయకన్ ॥

గజు—తాతగారు నేను! (34 అనుబంధము).

క॥ పదియోజనములలేగెద
విదితంబుగ నవలబోవ ♦ భీతిజనించున్
బదపడి సంద్రముదాటఁగ
మది ధైర్యము లేదు నాకు ♦ మానితచరితా॥

గవా— క॥ చనియెద నిరువది యోజన
వననిధి లంఘింపగా జ ♦ వంబు లవంబున్
గననైతినంచు మిక్కిలి
మనమునను విచారమొదవు ♦ మాన్యచరిత్రా॥

కావున నే నట్టికార్యమునకు జాలనని పల్కుటకు వగచుచున్నాను.

సుషే.—తాతగారు! నేను

గీ॥ ఊహ సేయంగ డెబ్బది ♦ యోజనములు
జనమునన్ దాటగా నేర్తు ♦ సచ్చరిత్ర
తక్కుగల యోజనంబుల ♦ దాటజాల
ననెడి భీతిమనంబున ♦ నందితయ్య॥

తాతగారూ! నాకు డెబ్బదియోజనములుపోవ ధైర్యమున్నదిగాని తక్కిన ముప్పదియోజనములు బోవ నే నసమర్థుండ.

జాంబ—ప్లవంగేశ్వరులారా! యిటువంటి శతయోజనంబులు శతమైనను నాకు లెక్కలేదు. కాని మున్ను త్రివిక్రమునకు ప్రదక్షిణము సేయునపుడు నా మోకాటియందొక శైలము విరిగియున్నది. ఇప్పటికిని కొలదిదూరము దూకిన కలుక్కుమని బాధించును. అయినను మీరీ కార్యమునకు సాహసించుమనిన సాహసించెద.

అంగ—తాతగారూ!

గీ॥ యోజనశతంబు దాటగా ♦ నోర్తుగాని
మగుడ వననిధి లంఘింప ♦ మాన్యచరిత

శక్తిచాల దటంచు సం ♦ శయము వొదము
సీతజాడల నెట్టుల ♦ జెప్పనేర్తు॥

అయినను బ్రయత్నించెద. సెలవొసంగుడు.

జాంబ—యువరాజా! నీవంతటి సాహసుండవే? కాని నీవు మాకు మూలంబవు. మేము నీకు శాఖాపుష్పఫలంబులము. మూలంబే లేనియెడల శాఖాపుష్ప ఫలంబు లుండునా? నీవు మాకు గురుండవు. గురుపుత్రుండవు, రాజవుగాన నిన్ను లంకకుఁబనిపిన మా గతియేమి?

అంగ—సద్గుణవంతా! జాంబవంతా! మనము రామరామాన్వేషణము జేయవచ్చి యసమర్థులమని పోయిన సుగ్రీవుడు బ్రాణములతో నుంచడు. కాననేనుపోయి యెట్లైన రాము దేవేరిని దర్శించి వచ్చెద. సెల వొసంగుము.

జాంబ—యువరాజా! నీ వీకార్యమునకు సాహసించవలదు. ఓయీ! అంజనీపుత్రా! యేమియు చేతకానివానివలె నూరకుండుట నీకు తగునా? నాయనా! ఆంజ నేయా! సముద్రోల్లంఘనము సేయ నీవుదక్క యీ ప్లవంగేశ్వరులయం దొక్కరుండును గానఁబడడయ్యెఁ గావున సీతాన్వేషణము నీ వలనగాదగునని నిశ్చయించితిని. నాయనా! రాము దేవేరిని దర్శింప లంకకు పయనముగమ్ము. నీయట్టి సాహసమూర్తి యీపనికి సాహసింపకున్న నేమియు చేతకాని వారేమిచేయుదురోయి? ఇంక మౌనము వీడి రామకార్యాసక్తుఁడవుగమ్ము. నాయనా! మనకు సుగ్రీవుడు నిర్ణయించినగడువు కొలదిరోజులలో నేయున్నది. నీవింక జాగుసేయక జలనిధి లంఘించి లంక నిశ్శంకఁజొచ్చి జానకిని దర్శించి రమ్ము.

ఆంజ—చిత్తము తాతగారూ! నన్నింతగా కీర్తించవలెనా? వీరల సాహసము విను టకై మిన్నకుంటిఁ గాని వేరొండుగాదు. ఇపుడు తమసెలవయ్యెనేని,

(35 అనుబంధము)

సీ॥ వాయువేగంబున ♦ వడిబోదు మీయాజ్ఞ
సూర్యచంద్రాదులు ♦ సుడివడంగ
విరిగి శైలాగ్రముల్ ♦ విపుల వృక్షసమూహ
మెగిరి మింటికిజేరి ♦ యిలబడంగ
వరిగిరింద్రమ్ములు ♦ వడవడ వడకంగ
భూనభోంతరములు ♦ బొబ్బలిడఁగ
తోయధులెల్లను ♦ దూలి పొర్లాడంగ
దిక్కులు పెక్కుగాఁ ♦ బిక్కటిలఁగ

తే॥ గీ॥ ధాటివారాశి యవలీల ♦ దాటినేను
లంక నిశ్శంకఁ జొచ్చి స ♦ ల్లలిత సీత
జాడలెల్లను దెల్పెద ♦ సత్వరముగ
నరుగుదెంచెద సెలవిమ్ము ♦ నధికప్రీతి॥

కపిపుంగవులారా! తమ యాశీర్వాదము చేతను, యువరాజు దీవనచేతను శ్రీరామ మంత్రిబలముచేతను, నిఁక లంకఁ జొచ్చెద. సెలవొసంగుఁడు.

జాంబ—ఆంజనేయా! మంచిది పోయిరమ్ము.

ఆంజ—చిత్తము. సర్వము రామమహిమయే

("రామ రామ రామ" యని యెగిరిపోవును)

అంగ—కపిపుంగవులారా! ఆహా! మనయాంజనేయుని జవ మేమని వర్ణింతును? అతనిధాటకు నిలువలేక భూధరంబులెల్ల నల్లలనాడుచున్నవి చూడుడు. ఔరా వాతజాత!

జాంబ—ఔను కపులారా! ఆంజనేయుని వర్ణింప నెవరితరమగును? ఓయీ! అంగదా! ఆంజనేయుని రాక నిరీక్షించుచు స్వయంప్రభా గుహాముఖంబున నుందము రండు.

అంగ—చిత్తము అట్లనే సేయుదము.

(అందరు నిష్క్రమింతురు.)

తురీయాంకము సంపూర్ణము.







శ్రీ



# సంపూర్ణ రామాయణము.



## పంచమాంకము.

### ప్రథమరంగము - కోటముంగిలి.

(ఆంజనేయులు, లంఘిణి ప్రవేశము.)

లంఘి—ఆ! ఎక్కడిదీ వింతమృగము?

గీ॥ ఎవ్వడవుర యిప్పటి కోటల వడిగ
వచ్చితివి గొంకులేక? నీ ♦ వధయొనర్తు
నెప్పు వృత్తాంతమంత నో ♦ చెనటికోతి!
విప్పు గంతులు జాలించి ♦ వేగిరంబ॥

ఓరీ! అడవియందుగల ఆకలములుదిని మత్తుచే నిక్కడికి వచ్చితివా? ఇంక నిన్విడచుటలేదు. నీ వృత్తాంతమంతయు విశదపరచుము.

ఆంజ—ఓసీ! నేను శ్రీరామదూతను. హనుమంతుడు. మీ లంకాపట్టణంబునగల వాపీ కూప తటాకంబులు జూడవచ్చితిని. ఒక్కపరి లోనికి బోనిమ్ము.

లంఘి—ఓరీ! రావణుని సెలవులేనిది పోవుటకు వీలులేదు.

ఆంజ—నన్ను పోనిచ్చెదవేని లంకలోని టెంకాయ తెచ్చిపెట్టెద.

లంఘి—టెంకాయలు లేవు సింకాయలు లేవు. ఇక పొమ్ము.

ఆంజ—అట్లనే పోయెద (అని లోపలికిపోవ ప్రయత్నించును.)

లంఘి—ఓరీ వెధవా! యెచ్చటికి బోయెదవు? (అని నెత్తిన కొట్టును.)

ఆంజ—ఓసీ మొండిరండా! యెంతదానవే! మగవాండ్రి మగనివలె గన్పట్టుచున్నావు.

గీ॥ పడతివంచును నినుజంప ♦ పాపమనుచు
మిన్నకుండిన గని ♦ మితిమీరియిట్లు

మిట్టిపడుచుంటివా నీదు ◆ మిట్టిపాటు
నడచెదను చూడు క్షణములో ◆ నసురరండ!

(అని గుద్దును.)

లంఘి—(క్రిందబడి) అయ్యా హనుమంతా! రావణుండు సీతను దెచ్చుననియు, సీతాన్వేషణముకొఱకు మర్కటులు వచ్చెదరనియు, ఆ మర్కటునిచే దెబ్బ తిందువనియు, నాటనుండియు నీలంకకు చేటుగల్గుననియు, పిమ్మట రావణుని కుటుంబనాశన మగుననియు, తొల్లి బ్రహ్మదేవుండు దెల్పియుండె. అతడు చెప్పినట్టు నీ గుద్దునకు బ్రాణావశిష్టురాలనైతి. గావున నన్ననుగ్రహించి నీవిక యథేచ్ఛగా లంకాపురమంతయు గలయందిరుగుము. నాకు సెలవొసంగుము.

ఆంజ—ఔరా! లంకిణీ ఎంతదానవే! నీ లంకవాసుల గుండెలలోని గాలమని తలంచు టెరుగవేమి!

(లంఘిణి నిష్క్రమించును.)

ఆంజ—అహా యేమీ యీ లంకాపట్టణ వైభవము!

హరిణగతి రగడ:- —

ఈ పురివైభవ ◆ మేమనియనదగు
కాపురమిట శ్రీ ◆ కాంతామణికిట
గోపుర మందిర ◆ కోష్ఠప్రహరులు
గోపనలెంకలు ◆ గొప్ప బజారులు
బంగరు గోడలు ◆ పరిసోయగములు
పొంగుచు దిరిగెడు ◆ పొలతుల గోటులు
మాకందంబులు ◆ మాజీఫలములు
శ్రీకకులంబులు ◆ శ్రీ గంధంబులు
పనసలు కమ్మని ◆ బదరీ ఫలములు
అనటుల సంతతు ◆ లట దానిమ్మలు
కజ్జూరంబులు ◆ కమలఫంబులు
గొజ్జంగులు సిత ◆ కుముదసంతతులు
నారంగంబులు ◆ ననగజనిమ్మలు
మాకేదులు మరి ◆ మల్లెలు మొల్లలు
తమలపు తీగలు ◆ పడుచగు నిమ్మలు
రమణీయంబుగ ◆ రాజిలు తరువులు
పిందెలు పూవులు ◆ పెంపుఫలంబులు

గ్రిందు గొలుపు క • న్గవకుపసందులు
కిలకిలలాడెడి • కీరభాషణలు
కలకలంబల్కు పి • కాలాపంబులు
గోరంకులు మృదు • కూజితములు పలు
పారావతముల • పలుకుబలుకులు
తమ్మితేనియల • ద్రావిన తేటులు
ఝుమ్మని చేసెడి • సొగసగు రుతములు
పట్టణమంతయు • పర్వినమ్రోతలు
దిట్టపునీడల • దనరినతావులు
చల్లదనంబుల • సౌరభ్యంబులు
నుల్లమిగుర్పగ • నుత్సాహంబులు.

ఆహా! యెందుజూచినను కలంకము లేకుండుటచేతనే? లంకాపట్టణమని ఖ్యాతిగాంచినది. పురదర్శన లాలసుండనై మైమరచి రాము కార్యము నారయక చరించుచుంటినే? ఏమి నాబుద్ధి మాంద్యము? ఈ సౌధము లందెచ్చట నుండునో రాము దేవేరిని దర్శించెద (అని వెదకుచు) ఆహా! యీ సౌధరాజమేమి? (వినుచు) ఆఁ యేమీ! ఇంద్రజిత్తనియా చెలికత్తె బల్కునది. (చూచి) ఇచట సీతలేదు. ఇంకొక యింటజూచెద. (వినుచు) యేమీ? అక్షయ కుమారుడనియా సేవకుడుబల్కుట. (చూచి) ఇందును జానకిజాడ కాన్పించదయ్యె. అయంగణము చూచెద.

(చూచి) రామ రామ రామ. నేడెంత పాపకార్యమొనర్చితిని.

చ॥ కటకట బ్రహ్మచారినయి • కన్నులఁజూడఁగ రానికార్యముఁ
దటుకున గాంచఁగావలసె • దానవరసాత్మల గాత్రమర్మముల్
పటుతరలీల నానొసట • పద్మజుడిట్టుల వ్రాసెనక్కటా
దిటమగు నాదుపాపముల • ద్రెంపగ జేయుత రామనామమే॥

ఆయింట నెవ్వరో మాటలాడుచున్నారు. పోయి చూచెద (చూచి) ఔరౌర పచ్చిమాంసమును దిని సారాయిని ద్రావుచు మత్తుచే గలహించుచుండిరి. యేమీ వీరల దుండగము! (విచారముతో) అయ్యో రామ చంద్రా!

(౮౮. అనుబంధము)

చ॥ తిరిగితి నఁగణంబులను • ద్రిమ్మరితివ్వడి వీధులన్నియుఁ
గలయఁగ మండపంబులను • కాంతల సౌధములెల్ల జూచితిఁ॥

పురమున గోపురంబులను । పొల్పగుమేడల నెల్లగాంచితిన్
హరిహరిగాంచనైతి జన । కాత్మజ నెందును నేమిసేయుదున్॥

అయ్యో దైవమా! నేటికి రెండుదినములనుండి పట్టణమంతయు గలయఁ దిరిగినను రామువేవేరిని గాంచనోచనైతినిగదా. హా! రామా! ఇక రావణుని యంతిపురబునకుం జని చూచెదగాక!

(37 అనుబంధము) (అని నిష్క్రమించును)

---

(ద్వితీయరంగము-రావణుని యంతఃపురము)

(రావణుడు మండోదరి శయనించియుందురు.

ఆంజ—(ప్రవేశించి) ఆహా! రాముదేవేరియగు జానకిని నీసౌధమున గాంచితిని గదా! నేనిక ధన్యుడ (మరలజూచి) ఆ! యేమి నాబుద్ధిమాంద్యము! నిశ్చయముగా రాముదేవేరియేమైన,

గీ॥ రావణుని సెజ్జపై నిట్లు । రామరామ
సంతసంబున నుండునా । సత్యశీల?
(చూచి) కాదు కన్గొన రావణు । కాంతగాని
జానకీదేవి గాదు సం । శయమికేల?

అదినిశ్చయముగా రావణుని భార్యయగు మండోదరియే? (ప్రకాశ) అయ్యో! పరమపతివ్రతామతల్లియగు సీతామహాసాధ్విపై నట్టి బెట్టిదంపు వాక్యములు బల్కితిని. శ్రీరామ రామ రామ. యెంతపాపమతిని! నా పాపము రామనామమే పావనము సేయుగాక (వినుటనభినయించి) ఏదేదో ప్రసంగించుచున్నారు. (ఏదోవినియెద) (అని ఒకవైపునయుండును.)

మండో—నాథా! నేడొక విపరీతపుకల గంటిని. ఒకానొక మర్కటుడు మన లంక నంతయు గాల్చినట్లును, అశోకవనమును గూల్చినట్లును, సీతామహాదేవితో ప్రసంగించినట్లును, కలఁగంటిని. సీతాదేవిని దెచ్చి మన లంకయందుంచినది మొదలు నామానస మేలాగో నల్లకల్లోలమగుచుండె. మీ కనేకవేల స్త్రీలుండ మనుజాంగనయగు సీతయేల? మాకన్న సౌందర్యవతియా? దేవా! సీతను రామున కిడితివేని మనకు జయముగల్గును. నామనవి వినుఁడు.

రావ—ఓసీ వెఱ్ఱిదానా! కోతి గీతి నన్నేమిసేయును?

మండో—నాథా! కోతియెగాదు, వాల్మీకిచే వ్రాయబడిన రామాయణమందు నైతము కోతులచే నీలంక నాశనమగునని వ్రాసియున్నది. మీరు గాంచ లేదా?

ఆంజ—ఈమె కోతియనుచున్నది. నారూపము కనుపించుచున్నదా యేమి?

(38 అనుబంధము.

రావ—ఈపిచ్చివ్రాతలకేమి! రామాయణమును దావిరచించిన వాల్మీకిని చుట్టు జుట్టి గిరగిరద్రిప్పి సముద్రమున బారవైచెద. ఇక మాటలాడకుండుము. నా ప్రతాపమంతయు నెఱిగియుండియు నేమియు నెఱుఁగని పిచ్చిదానివలెఁ బల్కెదవేమి? ఇక మిన్నకుండుము. నే నశోకవనమునకుం జని సీత నన్నుఁగోరునట్లు జేసెద.

మండో—నాథా! నామనవి చిత్తగించుము. అశోకవనమందుగల సీతచెంత కేగితి రేని మనకు తప్పక కీడుచేకూరును. కాన మీరు పోవలదు. ఆ రూప విహీనురాలితో నేమిపని?

ఆంజ—(తనలో) సీతామహాసాధ్వి యశోకవనమందుండెనని వీరు ప్రసంగించుచున్నారు. ఇక నేనశోకవనమున కేగెద ఇంక వీరేమి ప్రసంగించెదరో చూచెద.

రావ—దేవీ! పురుషుడు పరస్త్రీని మోహించిన కులకాంతలు వద్దనియు, కూడదనియు, చేటనియు, గీటనియు, పెద్దమ్మయనియు ననేకవిధములఁ బల్కెదరు. ఇంక నీ వేదాంతములు గట్టిపెట్టి మాటాడకుము.

ఆంజ—(తనలో) మూర్ఖుడగు వీనికి పతివ్రతోపదేశము లహితమాయెనే?

రావ—నేనిదేపోయి సీతను వరించెద. అంతుల కాపె యంగీకరింపకున్న బలాత్కరించెద. (అని లేచును)

ఆంజ—(తనలో) వీనికి కాలమాసన్నమైనది.

మండో—నాథా! మీరు పోవలదు. (అని పట్టుకొనును) (39 అనుబంధము.)

రావ—నన్ను విడువుము. నేను పోకమానను.

ఆంజ—(తనలో) నీవు పోయిన చావకమానవు.

రావ—సఖీ! సుఖముగా నంతిపురమున నుండుము పొమ్ము. (నిష్క్రమించును)

మండో—హా! యిదియొక వెర్రి.

సీ॥ వినడాయె నానుడి ♦ కనడాయెఁ గష్టవ
మనడాయె నేకొంక ♦ మనముగుదిరి
వలదంచు నేపల్కఁ ♦ గలవాణసతుని సీతఁ
దిలకించబోయెనే ♦ దలపకుండ
హితవాక్యముల వీడి ♦ యతనుకోలకు నోడి
వెతలందుటకు నాయె ♦ వెసగుబుద్ధి
కాదంచు నీకిది ♦ వాదించి యిది పాడి
గాదంచు బోధింప ♦ ఘనులులేర

గీ॥ చాలమూరుని కాంకి । పాలిలుమాలి
గోలసీతను గన్గొని । జేలకిలి
సోలు నానాథుమదిని గ । గ్గోలు వెట్టి
మేలు నాకొనరింప రీ । కాలమునను॥ (నిష్క్రమించును.)

అంజ—వీనికన్న ముందర నశోకవనము ప్రవేశించి వీని చేష్టలు చూచుచుండెద. మేరమీరిన యెడల రాముని చే నొనరింపబడు కార్యమునకు నేనే సాహసించెద. (అందరు నిష్క్రమింతురు).

(అవనికజారును)

---

తృతీయరంగము – అశోకవనము.

(విషాదముతో సీత, వికారరూపములతో రాక్షసాంగనలు ప్రవేశింతురు.)

సీత—అయ్యో దైవమా. (40 అనుబంధము).

చ॥ పుడమికి బుట్టితిన్ జనక । భూపుని యింటను బెంపునొంది యీ
పుడమిని సూర్యవంశమున । పూజ్యతనొందిన రామమూర్తికిన్
బడతుకనయ్యు నే సకల । భాగ్యములందియు నక్కటక్కటా
యడరుచు రాక్షసాధముని । యాజ్ఞను గుందగనాయె దైవమా!

ఉ॥ తప్పని యెంచ కేను ముని । దంపతులన్ బెడఁబాపి యింటినో
కిప్పలుగల్గె నాకిపుడు । సనదయాపగ! రామచంద్ర! నా
తప్పును సైచు లక్ష్మణుఁడ! । దాగునె కర్మము లెల్లకాలమున్
నెప్పుడొ రంగ జీవములు । నే నొనరించిన నోములేమగున్?

గీ॥ పరగలక్ష్మణు దిట్టిన । ఫలమునేడు
గంటి నానాథునింబాయ । గంటినకట
యసురకాంతల దుష్టవా । క్యములనెల్ల
వినుచునుంటిని మొండినై । మనుచునుంటి॥

అయ్యో దైవమా! నాదేహ మర్థాంగమనుటచే జచ్చుటకైన స్వాతంత్ర్యమొసంగవైతివే! నావంటి దురదృష్టురాలు బ్రతికి పుట్టినింటికి మెట్టినింటికి నపయశము దెచ్చుచుండ జంపక చూచుచుండ నీకు తగునా?(చూచి) హా దైవమా! దనుజాధముండగు రావణుండు మరల నిటే వచ్చుచున్నాడు. ఎటువంటి పలుకులబల్కి నన్ను బాధింపనున్నవాఁడో కదా? హా! నాథా! నీయర్ధాంగికెట్టియాపద చేకూరినది.(అని తలవంచుకొనును).(41 అనుబంధము)

రావణుడు ప్రవేశము. (42 అనుబంధము).

రావ—ఆహా! యేమి దీని సౌభాగ్యము! త్రిజగన్మోహిని యౌన దీనికే తగును

(ప్రికా) సీతా! యేటికిట్లు నిద్రాహారములుమాని యుండి కృశించెదవు? ఇదిగో యిటువినుము.

సీ॥ ప్రియమైన ఘనమైన ♦ పీతాంబరములుండఁ
గను మైలపుట్టముల్ ♦ గట్టనేల
కస్తూరి చందన ♦ ఘనసారములు గల్గ
పృథ్విధూళిని నీవు ♦ బృంగనేల
షడ్రసోపేతాన్న ♦ సారంబులుంగల్గ
నుపవాసములు శేసి ♦ యుండనేల
విరియుపూగుత్తుల ♦ గురుసెజ్జలవిగల్గ
కటికినేలనుబండి ♦ కొందనేల

గీ॥ విజయుఁ క్షీ్మకి విభుఁడనై ♦ వెలయుచుండ
నన్నుగోరక నీవింక ♦ నరునిఁగోరి
కందమూలంబులను దిని ♦ కానలోన
గష్టమేలను గడిపెదా ♦ కలికిమిన్న!

ఓసీ వెఱ్ఱిదానా! నరాధముఁడగు రాముని గోరుటచే నీకిట్టియిక్కట్టులు సంభవించినవి. నీ నాథుండెంతదుష్టుఁడుకానిచో కన్నతండ్రి కానలకంపునా? ఇప్పటికైనను తెలివిఁదెచ్చుకొని దుష్టుఁడగు నీపతిమాట దలంపక నాయింతి పురంబునకు రమ్ము.

సీత—(గడ్డిపోచ చేతబట్టుకొని దానిఁజూచుచు) ఓరీ రావణా! యేల నీవిట్టి దుర్భాష లాడెదవు? నీకు జీవములపై నిచ్ఛయున్నచో నిప్పుడు,

చ॥ వినయము మీరనన్ను రఘు ♦ వీరునకిచ్చియు కేల్మొగిడ్చినన్
గని నిను వేగ నెమ్మదిని గౌరవమొప్పగ గాచుఁబ్రోచురా
వినము మదీయ వాక్యములు ♦ వీరుడనంచని వెఱ్ఱివీగ నీ
జనములు ప్రత్యియొక్కటిట ♦ జచ్చుట నిక్కము రాక్షసాధమా!

ఓరీ రాక్షసా! నీకు జీవితముపై నిచ్ఛయున్న, నన్ను రామునకర్పించి శరణాగతవత్సలుఁడగు రఘువీరుని మన్ననలకు లోనగుము. లేకున్న నీకిఁక వుడమిపైబ్రాణంబులుండవు. నామాటవినుము.

(43 అనుబంధము)

రావ—ఎంతదాననే స్త్రీహత్యా పాపమని శాంతినహించ మేరమీరి బల్కుచుంటివా? మానవాధముఁడగు రామునకు నిన్నొసంగుటకాక నమస్కారముకూడ జేయవలయునుగా! థొందరొందకుము. నిన్నిచ్చి నమస్కారము జేసెదనులే,

సీత—ఓరీ క్రూరుఁడగు నీకు బరమపతివ్రతలతో బలుక నధికారము లేదు? కాన నీవింక పొమ్ము (అని తలవంచుకొనును)

రావ—ఇది వినయోక్తులతో లోబడునట్లు లేదు. (అని రాక్షసాంగనలజూచి) యేకజటా! హావిర్జటా! యేమి చేయుచుంటిరి?

ఏక—రాక్షసేశ్వరా! తమసెలవున కెదురుచూచుచున్నాము.

రావ—రాక్షసాంగనలారా! సీతను రెండు నెలలలోపల నా కిట్లయినను స్వాధీనము జేయుడు. అట్లుగానిచో మీ కరవాలములచే ఖండించి వండికొని దండిగా తిండి తినుడు. నేనిదే పోయెద. ఈకార్య మెట్లు నెరవేర్చెదరో!

హావి—చిత్తము. రాక్షసేశ్వరా ఇదెంతపని!

రావ—మంచిది. (నిష్క్రమించును)

హావి—ఓసీ సీతా! మా రాజరాజేశ్వరుఁడగు రావణుని వరించుము. లేకున్న నా కత్తిచే ఖండించెదను. మాటాడవేమి? (అని కత్తిద్రిప్పును)

సీత—రామరామ యెట్టి కర్ణకఠోరము లాలించవలసివచ్చెను!

ఏక—ఓసీ సీతా! ఇంద్రునికన్న మించినభాగ్యముగల మారాజును వరించుము. లేకున్న నిన్ను బ్రతుకనిచ్చుటలేదు. (అని కత్తిద్రిప్పును) మారుపల్కవేమి?

(44 అనుబంధము)

త్రిజట—(నిద్రలేచి) ఓరాక్షసాంగనలారా! శాంతించుడు. రాక్షస కులనాశము సమీపించినది. ఏలయిట్లు వదరెదరు? ... (45 అనుబంధము)

ఏక—సీతా! మాటిమాటికి రామరామయనుట మానుము. ఇకమీఁద రెండు మాసములు గడువిచ్చితిని. గడువులోపల మారాజును వరించుము. లేకున్న నిన్ను ఖండించుట సత్యము. నమ్ముము.

త్రిజట—ఓసీ ఏకజటా! యేమే యిట్లు వదరెదవు? సీతారాముల మహిమ వినుము. రాములవారు తమ్మునితోడ పుష్పకవిమానారూఢుఁడై అయోధ్యాపురంబున కేగినట్లును, రావణుఁడు మేనెల్ల రక్తములందికొనినట్లును, నల్లని వస్త్రములు ధరించినట్లును, తైలపానము చేసినట్లును కలగంటిని. కావున నింక శ్రీరామ జయంబును, రావణ నాశంబును కాగలదు. ఈ మహాసాధ్విని నింక నేమియు ననక నుపచారము సేయుఁడు. లేకున్న మనకు గతులు లేవు.

హావి—ఏమో నీవేచేయుము. మాకు నిద్రవచ్చుచున్నది. (నిద్రింతురు.)

త్రిజ—అమ్మా! సీతా! ఊరడిల్లు మూరడిల్లుము.

ఆంజ—ఈమూండ ఇంకను మేలుకొనియుండినదే! నేనెట్లు దేవితో మాట్లాడుదును? తెల్లవారివచ్చుచున్నదే.

సీత—అమ్మా త్రిజటా! యీ నిర్భాగ్యురాలి కింతటి భాగ్యమొదవునా? ఇంక నాకు మరణమే శరణము. (కండ్లు మూసికొనును)

త్రిజ—అమ్మా దుఃఖించకుము నీకు శుభమే చేకూరు. ఆహా! నిద్రవచ్చుచున్నది (పరుండును.)

సీత—(మెడ కురిబోసికొన యత్నించును)

ఆంజ—అయ్యో! సీత చావున కుంకించుచున్నది. అమ్మా జానకీ! నీ నాథుండు సోదర సహితంబుగా ఋష్యమూకాద్రిపై సుఖమైయుండె. నీవు ప్రాణత్యాగము చేసికొనవలదు.

సీత—(తనలో) ఆఁ యేమది. కలయా? నిక్కమా? కోతిని స్వప్నముందుగన్న యశుభమని పెద్దలు బల్కుదురు. రామ రామ రామ రామ. ఓరీ రాక్షసాధమా! దొంగవై నన్ను గొనివచ్చినది చాలక కోతిరూపమున నన్నలయింప వచ్చితివా? ఓరీ నీచా!

ఆంజ—అమ్మా! నేను రాక్షసుఁడను గాను. నిక్కముగ నమ్ముము. నేను రామదూతను. తల్లీ! నీ సేమమారయుటకై నన్ను రాముఁడు బంపియుండె. నిక్కముగా నేను శ్రీరామదూతనుగాని రాక్షసుడను గాను.

సీత—ఓరీ! నిక్కముగా నీవు రామదూతవేయైన రాముని రూపలావణ్యములు వర్ణించితివేని నమ్మెద.

ఆంజ—అమ్మణ్ణీ! మహాప్రసాదము. చిత్తగించుము.

గీ॥ నీలములమించు కాంతులు । నిగ్గుదేరు
మేనికాంతులు గల్గున । మేయ యశుడు
దీనజనబాంధవుండు సు । ధీయుతుండు
భూరిభుజ విక్రముండురా । ముండు తల్లి॥

అమ్మా! వానరుండనగు నేను వారిని వర్ణించ నేర్తువాఁడను? మరియు రూపమునందును, గుణమునందును, శౌర్యమునందును, రామునకు వెనుదీయుడు రామానుజుండగు లక్ష్మణుండు. అమ్మా! నిక్కముగా నే నీదాసుడ నమ్ముము. (అని నమస్కరించును) తల్లీ నీ నిజేశుండు సకల గుణాభిరాముండగు శ్రీరాముండు నీ కానవాలొసగిన ముద్రిక యిదిగో గ్రహించుము. (అని ముద్రికనిచ్చును).

సీత—(తీసికొని) అయ్యో రామరత్నమా? యెన్నాళ్లకు నిన్ను గంటిని. ఓ యంగుళీయకమా!

కం॥ కారుణ్యంబున రామచంద్రునకు న । స్కల్యాణముగా జేసి నీ
వేలీలా బెడబాసి మమ్ములను । నీవెట్లుంటి విన్నాళ్ళు హా

పారంబింతయు లేని బ్రేమమున నా ♦ ప్రాణేశు నన్గూర్పగా
జేరఁగవచ్చితి వంతెచాలు నిను నే ♦ జేకొందునో రత్నమా !

ఓ రామరాజ భూషణమా! దేశాంతరమున నున్న నన్నును నానాధుని గూర్పవచ్చితివా? నాయనా కేసరిపుత్రా! నీవు కేసరిపుత్రుఁడవని సార్థక నామము నిల్పుకొంటివి. అయ్యా! నాకు రాముని క్షేమము దెల్పి నా ప్రాణములనిల్పి పుణ్యము గట్టుకొంటివి. నీ వాక్యగంతున లంక ప్రవేశించి యంతయుఁ దిరిగ్గితివి. ఇట్టి ధైర్యసాహసములు గల నీకు నీయధమ దానవులచే భీతిలేదు. ఇకమీద నిశ్చల స్వాంతుడవై యుండుము. అయ్యా! నన్నెప్పుడు రాముడు సాకేతపురి జేర్చును.

ఆంజ——అమ్మా! నీ కొరకు శ్రీరాముఁడు అన్న పానీయంబులు విసర్జించి మిగుల గుందుచున్నవాఁడు. తల్లీ! మీ క్షేమవార్త లెరింగినతోడనే, నాకన్న మిన్నలగు ప్లవంగేశ్వరులగూడి రాక్షసకులనాశంబొనర్చి కొలది కాలములో నిన్ను సాకేతపురము జేర్చగలఁడు. చింతింపకుము. తల్లీ! నీ విచ్చట నిలువలేనిచో నా భుజములపైగూర్చుండుము. నిముషమాత్రములో శ్రీరాముని చెంత జేర్చెదను.

(౹౹ అనుబంధము.)

సీత——అయ్యా! నీవంతటి సాహసుండవేగాని వట్టి పిరికిదాన. అంతటి కార్యమునకు నేను సాహసింపఁజాల. నీవు మార్గమధ్యమున రక్కసులతో బోరాడు నప్పుడు భీతిల్లి క్రిందపడియెద, గావున నన్ను క్షమింపుము. మరియు నీవు నన్నిప్పుడు గొనిపోయిన యిది యంతయు దొంగతనముగా నుండును.

ఆంజ——చిత్తము. మీ యిష్టము. అమ్మా! నే నిట్లనే యుండువాఁడనుగాను. నా నిజరూపమును జూడుము. [అని విశ్వరూపము జూపించుచున్నాడు].

సీత——అయ్యా! యింక నీ భీకరాకృతిని జూడఁజాలను. శాంతి నొందుము, శాంతి నొందుము.

ఆంజ——అమ్మణీ నేను,

గీ॥ తడయరాదింక శ్రీరామ ♦ ధరణిపతికి
నిచటి జాడలు దెల్ప నే ♦ నేగవలయు
రాఘవులు నమ్మ నేదైన ♦ రమణియొకటి
యానవాలిమ్ము సెలవిమ్ము ♦ నేనుబోదు॥

సీత——అంజనీపుత్రా! యిదిగో! యీరత్నమునుగొని, నా నాధునకిడి నా యీవిన్నపమును విన్నవింపుము.

సీ॥ పాషాణమును ద్రొక్కి ♦ పడఁతిగాఁ జేసిన
పాదంబులకు నింకఁ ♦ బ్రణతులనుము
తారకమంత్రమై ♦ ధరణిపై పొందుమీ
రామనామము నమ్మి ♦ రమణియనుము
మింటిమీఁదిపల్కిన ♦ మాటిలేని వదినెను
క్షమియించుమంచు ల ♦ క్ష్మణునకనుము
మాసమ్ములో లంక ♦ మసియొనర్పకయున్న
సత్యము జానకి ♦ చచ్చుననుము
గీ॥ అన్నమును నిద్ర విడనాడి ♦ యున్నదనుము
మిమ్ము హృత్పద్మముల జూచు ♦ నమ్మెననుము
దిక్కెవ్వరు లంకలో ♦ మ్రొక్కెననుము
అంజనీపుత్ర! సీత యి ♦ ట్లాడెననుము॥

మిగులఁ జింతింపుచు నిట్లుగా నుడివినదని విన్నవింపుము.

ఆంజ—చిత్తము. తల్లీ! పోయివచ్చెద. సెలవొసంగుము (పోవుచు) నేను లంకాపట్టణమునకు వచ్చి రిక్తగాపోవుట శూరుడనగు నాకు తగవుగాదు. గాన కొన్ని ఫలంబులఁ దిని యీ వనమెల్ల నల్లకల్లోలము జేసిపోయెద.

(అని నిష్క్రమించును) (యవనిక పడును)

---

(తురీయరంగము—అక్షయకుమారుఁడు, ఇంద్రజిత్తు, మరికొందరు రాక్షసులు ప్రవేశము)

అక్ష—ఓరీ కోతీ! నందనవనమెల్ల నాశనము సేయుట పౌరుషముగాదు. నన్ను గెల్చి ప్రాణములు నిల్పుకొనుము.

ఆంజ—ఓరీ పిరికిరాక్షసా! నిన్ను వాలమునఁ జుట్టి జలధిలోఁ బారవైచెదఁ జూడుము.

అక్ష—ఓరీ! (47 అనుబంధము)

గీ॥ మేరమీఱిట్లు బల్కుట ♦ తీరుగాదు
కదనమందున నిల్వుమీ ♦ కదలకుండ
మట్టుపెట్టెద నిన్నింక ♦ మిట్టిపడకు
కొండ యనుకోర నస్గస ♦ పండుకోతి॥

(అని బాణములు వేయును)

ఆంజ—

ఉ॥ చాలునుచాలు నాపుమిక ♦ చప్పరి తూపులఁగాంచినాడ నా
వాలముతోడ మొత్తెద న ♦ వారితశూరత మోప్రిలనిల్వఁడీ
బాలుఁడటంచు నెంచి మదిఁ ♦ బాపములెంచని ప్రేమఁజూపనీ
కాలమువచ్చె పిల్లఁగను ♦ గాలుని చెంతకుఁ బోవుచుంటివే!॥

ఓరీ! అక్షయుడా! యీ దెబ్బతో నీవుచెల్లు (అనివాలముతో గొట్టును)
(అక్షయుడు క్రిందపడును)

ఇంద్ర—ఓరీ మాయకోతీ! బాలుఁడగు అక్షయకుమారుని జంపుటయా నీ గండు తనము? నస్గడ తేర్చి మరిపొమ్ము.

ఆంజ—ఓరీ! నీసోదరునిగతి యేమయ్యెను? నీవును అంతియే; రమ్ము.

ఇంద్ర—ఓరీ! బ్రహ్మాస్త్రముచే నిన్ను గట్టివైచెద జూడుము.

ఆంజ—అటులనా? రానిమ్ము. (48 అనుబంధము.)

ఇంద్ర—(బ్రహ్మాస్త్రము వేయును.)

ఆంజ—రామరామరామ (అని క్రిందపడును. ఇంద్రజిత్తు హనుమంతుని రెక్కలు గట్టును.) (యవనికపడును.)

---

పంచమరంగము - రావణుని సభాస్థానము.

(విభీషణుఁడు, రావణుఁడు, రెక్కలుకట్టినహనుమంతుఁడు ప్రవేశము.)

ఆంజ—(తనలో) తొల్లి బ్రహ్మదేవుఁడు నీవు బ్రహ్మాస్త్రముచే నేడుగడియలు గట్టబడియుందువు. పిమ్మట నిన్నది వీడునని వరమిచ్చియున్నాఁడు; కావున నట్లనేకాగలదు. ఇంతలో రావణాసురునితో ప్రసంగించెద.

రావ—తనయా! అక్షయకుమారుని జంపిన కోతి యిదియేనా? ఓరీ వనచరాధమా! నీ విక్కడి కేలవచ్చితివి? నిన్నెవరుబంపిరి? సత్వరముగా జెప్పుము. లేకున్న నిన్ను శిక్షించెద.

ఆంజ—ఓరీ! నేను వాయుపుత్రుఁడ. రామదూతను. సీతాదేవిని వెదకవచ్చితిని. మఱియు నిన్ను జూడదలంచియు, నీతో ముచ్చటించదలంచియు, నీతనయుని బ్రహ్మాస్త్రముచే బద్ధుండనై యిటువచ్చితిని. అది యటుండనిమ్ము. నన్ను బంపినది రాముఁడు. ఆరాముని ప్రతాపము దెల్పెద వినుము.

ఉ॥ శంకరు చాపమున్విరిచె । సాహసు, భార్గవు నోటుబుచ్చె నీ
జంకక పాశబద్ధునిగ । సల్పిన వాలిని కోలగూల్చెనా
డింకను రాక్షసాధముల । నెందరినో దునుమాడె, నౌర నీ
వంకకు నన్నుబుచ్చె నిక । వారిపరాక్రమ మేమిజెప్పుదున్॥

ఓరీ రావణా! నా ప్రతాపము వినుము.

ఉ॥ తోటలు ద్రుంచివైచితివి । ద్రొక్కితిఁ గుద్యములన్ని నుగ్గుగా
మేటియటన్న నీసుతు ని । మేషములోపలఁ జంపివైచితే
ధాటిగ నీదుమస్తక వి । తానముఁ దన్నగనెంచియుంటి మో
మోటమి సుంత లేదు మరి । యూరక వాగకురోరి రావణా॥

(అని తన్నబోవును. రాక్షసులు బట్టుకొందురు.)

రావ—ఓరీ గర్వపోతా. దూతవగు నీకెంత యధికారముగలదో యట్లుండక మీర మీరుచుంటివి! నిన్నిప్పుడే ఖండించెదను చూడు. (అని కత్తియెత్తును)

విభీ—(అడ్డమువచ్చి) అన్నయ్యా! శాంతమూనుము. నేతనువీడి దూతనుజంపుటచే లోకులు మిగుల దూషించెదరు. కావున యీ దూతకు బుద్ధివచ్చునట్లొక ముద్రవైచి పంపుము.

రావ—అట్లయిన వీనితోకకు తైలములోముంచిన గుడ్డలుచుట్టి అగ్నిముట్టించి పంపుడు. సీతకొరకై వచ్చినకోతికి వాత యిడియని లోకులు మెత్తురు.

విభీ—మంచిది. అట్లనే చేసెదము. (అందరు నిష్క్రమింతురు)

ఆంజ—(లంకతగులబెట్టి పునఃప్రవేశము) ఇప్పటికి లంకాదహన మహోత్సవం బైనది. లోకమాతయగు సీతను మరల దర్శించి సెలవు గోరిపయనమై పోయెద.

(నిష్క్రమించును) (యవనిక పడును)

పంచమాంకము సంపూర్ణము.







శ్రీ



# సంపూర్ణ రామాయణము.

## షష్ఠాంకము.

ప్రథమరంగము—బయలుప్రదేశము.

(రామ, లక్ష్మణ, సుగ్రీవాంగద, హనుమంత, జాంబవంతాది వానరులు ప్రవేశము)

రాము—అయ్యా! సూర్యసూతీ! ఇక జాగుసేయక లంకాపురిజేర సకలవానర సైన్యంబుల సమకూర్చుము.

సుగ్రీ—చిత్తము.

అంగ—అయ్యా! రఘునందనా రావణుని గర్వాంధకార మున్నతోలది హెచ్చుచున్నది. వానిని సంహరించ సత్వరము సెలవొసంగుము.

సుగ్రీ—కుమారా అంగదా! యింక జాగుసేయక సైన్యంబుల సమకూర్చుము.

అంగ—చిత్తము (అని నిష్క్రమించును)

లక్ష్మ—అన్నయ్యా! మిట్టిపడుచున్న రావణాధము నొక్కకోలనే కూలనేసెద. నాప్రతాపముఁ జూడుము.

రాము—లక్ష్మణా! శాంతించుము లంకాపురప్రవేశమైనపిమ్మట కర్తవ్యమాచరింతము. ప్లవంగేశ్వరులారా! స్వామికార్యము నెరవేర్చ ప్రయత్నించుడు.

సుగ్రీ—చిత్తము.

(అంత విభీషణుండు ప్రవేశము)

విభీ—శరణాగతవత్సలా! రామచంద్రా! శరణు! శరణు!!

రాము—ఓయీ భయపడకు. రక్షించెద. నీవృత్తాంతమంతయు జెప్పుము.

విభీ—అయ్యా, అర్కకులాధినాథా! చిత్తగింపుడు. నేను లంకాపురాధీశుడగు రావణాసురుని సోదరుఁడ, విభీషణుఁడనువాఁడ. లోకమాతయగు సీతను శ్రీరాములకొసఁగుమని నీతులుదెల్ప మాయన్న రావణుఁడవి యవినీతులుగాదలచి నన్ను పరిభవించి లంకయం దుండనియక పారదోలె. దేవా!

యీ యనాథయగు విభీషణుఁడు గావవేడుచున్నాఁడు. (అని పాదములు పట్టుకొనును).

లక్ష్మ—అన్నయ్యా! చూచితివే వీనిమాయ? మనమిట్టి మాయలెన్ని చూచి నారము? వీఁడు మనకు మసిబూయదలఁచి వచ్చి శరణు శరణనుచున్నాఁడు! కాన వీనికి శరణమొసఁగరాదు. నా మనవి నాలింపుడు. ఇమ సెలవైన ఖండించెద.

రాము—సోదరా, లక్ష్మణా!

ఉ॥ స్వామిభరింపుమీ శరణు । పాహియటన్నను గాచునట్టి నా
నేమము వీడఁజాలఁ గడు । నిఁదల పాలగునట్టి కార్యముల్
నామదిఁ జేరనీను నను । నమ్మిన రక్షణమబ్బగాని జూ
రాముఁ డధర్ముఁడంచనరె । రాజులు కీర్తి నశింపదే భువిన్ ॥

తమ్ముఁడా! ముందుగా రక్షించెదనని పల్కితిఁగాన వీని విడిచితినేని లోకుల కొక యవినీతి నేర్పినవాఁడనగుదును. ఎద్దియున తొల్లి రక్షించెద నని రాముఁడే నీతి దప్పెఁగాన మనమెంతటి వారమని లోకులెల్లరు నన్ను దలంచుచు ననాచార కార్యములనే యవలంబించెదరు. అట్టి యధర్మము నకును యన్నృతమునకును నేను సహించజాల. నితడు పరమభక్తుఁడు. ఈతని వీడజాల (అని విభీషణునిపై జేయివైచును).

విభీ—అయ్యా లక్ష్మణా! మన్నింపుడు. రావణాసురుడు సురాసురలచేఁ జావు లేకుండ వరప్రసాదము బడసెనుగాని నరునిచేఁ జావులేకుండ గోరలేదు. వాని జంపు నుపాయమును లంకయందుండు రహస్యములను వెలిబుచ్చెద నన్నను గ్రహింపుడు.

రాము—మంచిది. విభీషణా అట్లయిన నిన్ను లంకకు రాజ్యాభిషిక్తునిగా జేసెద. ఇంక స్వామికార్యము నిర్వర్తింపుము.

సుగ్రీ—అయ్యా! రఘుకులనందనా? విభీషణుని లంకకు రాజ్యాభిషిక్తునిజేసె దమని నుడివియుంటిరి. ఒకవేళ రావణాసురుఁడు మిమ్ముల శరణుజొచ్చిన నేమి జేసెదరు ?

రాము—సూర్యసూతీ! అట్లయినచో నాప్రతిన నెరవేర్చుకొన లంకకు విభీషణుని రాజుగానియమించి రావణాసురునకు నారాజ్యమగునయోధ్య నంతయునిచ్చెద.

సుగ్రీ—చిత్తము.

రాము—విభీషణా! లంకకు జేరు నుపాయ మాలోచింపుడు. ఇంక జాగుసేయఁదగదు.

విభీ—చిత్తము. అట్లనే జేసెద. అయ్యా సుగ్రీవా! రండు, సేనలఁగూర్చుక పోదము.

(అందరు నిష్క్రమింతురు). (యవనికపడును).

ద్వితీయరంగము - యుద్ధభూమి.

(ఇంద్రజిత్తు పడియుండును. రావణుడు విషాదముతో)

రావ—హా! తండ్రీ! అనేక మాయలునేర్చి, యెందరెందరినో దునిమి, కీర్తిగాంచి నేటికీనరాధమునిచే యస్తమించితివా?

ఉ॥ హా! యసురాగ్రగణ్య యమ । రాధిప బాహుబలాపహార! హా!
హా! యువరాజ లోకజిత । హా! సుగుణోన్నత వంశదీపకా
హా! యిట బుష్పశయ్య ధర । యయ్యెఁగదా పుదనిద్ర బోవగా
నాయన! మమ్ము వీడిచన । నాయమె నన్నను లెత్తి చూడరా॥

అయ్యో! రావణ వంశాంకురమా! నీకిట్టిగతి చేకూరినది. తండ్రీ! నీవు లేనియెడ నాకీ లంకాపట్టణమేల? ఈ రథ గజ తురగాదివాహనంబు లేల? హా! తండ్రి నీవులేమిచే లోకమెల్ల నంధకారబంధురమైనది. (మోముజూచి) హా!కుమారా! మేఘనాధా! యింద్రాదిదిక్పాలుర సొంపుమాలించి, చెరలబెట్టి జగములనెల్ల, బెగడుపరచి యనేక మాయలుపన్ని పగతుర నెగటార్చి కీర్తిగాంచి, నేడీనరాధముని శితశరప్రకరంబులకు లోనై కీర్తిశేషుడవైతివా? హా! తండ్రీ! యిక నే మనజాల. (కోపముతో) ఓరోరీ నరాధమా? కదనమందు నీ రూపుమాప రావణుండిదే వచ్చుచున్నాడు. తొందరనొందకుము.
(అని లేచిపోవును.) (యవనిక పడును.)

తృతీయరంగము - యుద్ధభూమియందొక పార్శ్వము.

(లక్ష్మణుడు మూర్ఛపడియుండును.)

(రాముడు విషాదముతో) (41 అనుబంధము.)

రాము—హా! లక్ష్మణా! సౌమిత్రీ! ఊర్మిళామనోహరా!

సీ॥ సవతులయందున । జననమొందుటెగాని
యొక మాతృబిడ్డలో । యనఁగ బ్రజలు
ఒక్క పల్లెరమున । మక్కువ మెసవియు
శయనించితిమి యొక్క । శయ్యపైని
శైశవముననుండి । శ్రమలొందనీక నా
సర్వకార్యంబులు । సల్పితీవు
చిరకాలముననుండి । గురుభావమునగొల్చి
వనిలోని ఫలములిం । పెనయ నిచ్చి
తే॥ యింతదనుక రక్షించితి । విప్పుడిచట
నన్ను విడనాడిపోతివా । యన్న కనులఁ

జూడ యెగ్గేమి యొనరించి ♦ నాడనయ్య?
అకట నసురునిచేత ని ♦ ట్లయితివయ్య॥

సుగ్రీ—మహాత్మా! సర్వమెరింగిన మీరే యిట్లు దుఃఖింప మాబోటివారి గతియే మగును? దుఃఖోపశమనము జేసికొనుడు.

రాము:—ఓయీ సూర్యసూతీ! నా కాపదలమీదనే ఆపదలు వచ్చుచున్నవి.

గీ॥ రాజ్యమేలుటలేక న ♦ రణ్యములకు
జనుటయేగాక, నసురచే ♦ జనక సుతను
గోలుపోవుటగాక, నా ♦ కుడిభుజమ్ము
నైన; లక్ష్మణుఁడనిపడ ♦ నయ్యెనయ్యొ॥

విభీ—ఓయీ హనుమంతా! రఘువరేంద్రునకు దుఃఖమంతకంత కధికమగుచున్నది. లక్ష్మణుఁడు మృతినొందెనో లేక మూర్ఛనొందెనో కనుగొన సుషేణునకు దక్క మనకు దెలియదు. కాన నింద్రజిత్తు బాణవేదనకు నిలువలేక నేమూలనో పరితపించుచుండవచ్చును. నీవు శీఘ్రముగాజని యాతనిఁ దోడ్కొనిరమ్ము.

ఆంజ—చిత్తము! ఆతఁడు బాణవేదనచే కదలలేకుండిన నాభుజములపై నిడికొని క్షణమాత్రములో వచ్చెద. సెలవొసంగుడు. (అని నిష్క్రమించును)

రాము—హా! లక్ష్మణా! అతికాయాదిగర్వాపహారా! నన్నెంతదుఃఖమున ముంచితివి?

మ॥ మును గాధేయుని యజ్ఞరక్షణమునన్ ♦ మోపెట్టి నాకండవై
కనులన్ మాయక దుష్టదానవుల వే ♦ డ్కన్ నీవు ఖండించ నేఁ
గని నీయంతటి తమ్ముడుండుటది భా ♦ గ్యంబంచు సేసెంచ నో
యనుజా! పల్కవదేల నాకిపుడు సా ♦ యంబుండ నీకొప్పదే?

అయ్యో! సోదరా! జనకచక్రవర్తినిజాంగణమున నూర్మిళాసహితంబుగా పెండ్లికొమరుండవై యుండ పరమసంతోషమున జూచిన నేను నీభంగపాటు గూడఁ జూడవలసివచ్చెనే. హా! లక్ష్మణా! లక్ష్మణా!

చ॥ వనమున కేను రాఁగడగు ♦ పట్టున తోడ ప్రియానామైన ని
స్గని వలదంచుఁబల్క విన ♦ కన్ ననుమీవెను వెంటనదొడ్క పో
మ్మనుచు ప్రమాణముల్ జనని ♦ పైవెసలెక్కకు మిక్కుటంబుగా
నన మదిబొంగి వల్లెయని ♦ యంగన గూడుకఁ జేరి యాజిలో
ననుజూడ నిన్నుగోల్పడితి ♦ నమ్మలకేమని విన్నవించెదన్?

హా! తమ్ముడా! అయోధ్యకు నేనెట్లుపోదును? పోయిన నాతనయుఁడేడని సుమిత్రామతల్లి యడిగినంతనే నిన్ను ద్రుంగితివని చెప్పనా? హా! తమ్ముడా! నీశోకభారమున మనకులమంతయు నస్తమించునుగదా?

(అంత హనుమత్సుషేణులు ప్రవేశము)

సుషే—రఘునందనా! జయము జయము.

రాము—అయ్యా! సుషేణా! యింకెక్కడిజయము. శైశవమునుండియు భక్తిభావమున సేవలుసల్పిన యనుంగుసోదరుండును నా దక్షిణభుజంబును నగు లక్ష్మణకుమారునకు భంగమన్న విచారమానసుండనైయున్న నాకుజయముకల్గునా?

సుషే—అయ్యా యీరఁడిల్లు మూరఁడిల్లుము. (అని లక్ష్మణుని నాడీ లక్షణాదుల బరీక్షించి) మహాత్మా రాఘవా! లక్ష్మణ కుమారుని ముఖకాంతిజూడ పూర్ణిమాశశాంకునిరీతి విరాజిల్లుచున్నది. ఇట్టి తేజముండుటచే నితని మేన బ్రాణములున్నవి. (మరలజూచి) దేవా! యిది నిక్కముగా మూర్ఛ! నామాట నమ్ముము. ఈమూర్ఛ దీరుట కొకయుపాయముగలదు. చిత్తగింపుడీ. ఈ కార్యమును సాధింప నంజనీ పుత్రుఁడు దక్క యితరులకు సాధ్యముకాదు. కావున ఆ కార్యమున కాతఁడు సాహసించవలయు.

ఆంజ—సుషేణా! స్వామి కార్యము దీర్చ వెనుకాడెదనా? వేగమఁజెల్పుము. మహాళి ధరించి నిమిషమాత్రంబున నెరవేర్చెద.

సుషే.—అట్లయిన వినుము. నీవువరుణాలయంబుదాటి యుత్తరదిక్కున కరుగుము. అందు హిమాలయంబు కనంబడు, దాని కావలిభాగమున హేమకూటము గలదు. దాని కనతిదూరంబున ఋషభాచలంబు గలదు. ఇవియన్నియు నిర్గమించిన మేరుగిరి జేరుదువు. దానిందాటిన కైలాసంబు గనంబడు. దానికి గడుదూరంబున శృంగవంతంబను పర్వతముగలదు. దాని కుత్తరదిశయందు నీలశ్వేత కనకాంబరము లనెడి పర్వతంబులు గన్పట్టు. వాని కావలిభాగంబున లవణక్షీర సముద్రంబులును, శాకద్వీపంబులు గలవు. నీ వా సముద్రంబు లంఘించితివేని చంద్రనగంబును ద్రోణాద్రియుఁగలవు. ఆ రెండు పర్వతములమధ్య మహోదయపర్వతంబు కలదు. అందు విశల్యకరణి, సంధానకరణి, సౌవర్ణకరణి, సంజీవికరణి, యనునవి నాలుగుభాగంబులుగా విభజించియుండు. అందు శ్వేతపర్ణంబులచేతను, మెట్టనిసుమంబులచేతను పచ్చని ఫలంబులచేతను, రాజిల్లు నోషధులుగలవు. అవి నిశీథిసమయంబున పరాక్రమంబులుగను, దివంబున కళావిహీనంబులునై యుండు. గాన నీవు వాని నెట్లయిన సాధించి యిచ్చటికి దెచ్చితివేని రామానుజుండు మనును. ఇది నిశీథ సమయమగుటచే మిగుల నేర్పరితనము వహించి యరుణోదయము కాకమున్నే మెల్లనను దేవల యు. లేకున్న లక్ష్మణునకు ప్రమాదముజరుగును.

రాము—అంజనీపుత్రా! దుఃఖసాగరముననున్న నన్ను దరిచేర్పుము.

గీ॥ అనుజపముఁడవు నాకు నీ ♦ వాంఛనేయ
నీకులక్ష్మణుఁడట్ల యు ♦ స్తోకమతిని

నోషధులఁ దెచ్చి తమ్ముని ♦ యొనరఁ బ్రతుకఁ
జేసికొనుమయ్య కీర్తియా ♦ ర్జించుమయ్య॥

ఆంజ—స్వామీ! మీరింతగా నొక్కి చెప్పవలయునా? ముహూర్తమాత్రంబున నోషధులఁ దెచ్చెద చూచుచుండుడు. (అని నిష్క్రమించును)

రాము—సుషేణా! నీవు చెప్పినచొప్పున ఆంజనేయుండరిగె. నచ్చట వాని కపకారి మొదవదుగదా! (లక్ష్మణునిజూచి) అయ్యో సౌమిత్రీ! ప్రమత్తుండైన ఇంద్రజిత్తుని దెగటార్చి భూజనుల చింతలెల్ల దీర్చితివని సంతసించితిగదా. ఇంతలో నీకిట్టి యాపద చేకూరినది. అయ్యో! సుషేణా!

ఉ॥ ఒక్కఁడు ద్రోణగుబ్బలికి ♦ నొప్పుగఁ జేరునె జేరుబోసుమా
అక్కడి దేవదానవుల ♦ నాజినిఁ గూల్చునె గూల్చుబోసుమా
జక్కవ రేడు రామునువు ♦ సంజివి దెచ్చునె, దెచ్చుబోసుమా
ఏక్కడి మృత్యుదేవ తిటు ♦ లీతని డాసెనె బాసెబోసుమా॥

సుషే—దేవా! శాంతింపుడు. మీ రన్నటుల నవిలబలాఢ్యు లహర్నిశంబు లచ్చోటఁ గావలియుందురు. అది దెచ్చుటకు హనుమంతునికిదక్క నొరుల కసాధ్యంబు. అది యెఱింగి యే నతనిబంపితి. అతఁ డిప్పటికి నోషధీయుతంబుగ మరలి పయనోన్ముఖుండు గావచ్చును.

రాము—అయ్యో సౌమిత్రీ!

ఉ॥ అంబయు జేవి నన్నడుగ ♦ నక్కట యేమనిబల్కువాఁడ నా
వెంబడి నీవురాక జన ♦ వేమరునే యిటు చెప్పఁజాలనో
యంబయు రాణిసోదరులు ♦ హా! యని నన్నటుదూఱువారలో
యంబుజనేత్ర లక్ష్మణుఁడ ♦ యందరు నీకడ జేరువారలే॥

(అప్పుడు అరుణకాంతి మెఱయును)

(కోపముతో) ఆ యేమీ! వినిపాగరు చూడు చూడు పాపిష్ఠ. విభీషణా,

(౫0 అనుబంధము)

చం॥ ఇనకులదీపకుండిపు డ ♦ హీనహితం స్మృతిదప్పియుండనీ
మనమున నీర్ష్యబూని వడి ♦ మారుతిరాకకు మున్న దోచినన్
ఘనమగు నాశరాగ్ని నిను ♦ గాల్చెద నిల్వుము గాచికొమ్ము నీ
మనమున చింతసేయుమిట ♦ మాయెడ వైరము జూపగల్గుదే!

ఓరీ! శత్రుజనపక్షపాతీ! నీతిదప్పి జ్ఞాతివైరము జూపవచ్చితివా! నిను దెగటార్చి లోకమంతయు అంధకార బంధురము జేసెద చూడు. (అని బాణ మెక్కుబెట్టును).

(తెర లో)

గీ॥ వాయు పుత్త్రకుం డీగతి । వచ్చుచుండె
నోషధులకాంతి యది గాని । యొండుగాదు
సాహసంబున కిపు డవ । సరముగాదు
రామ సద్గుణధామ! సంగ్రామభీమ!!

విభీ—దేవా! జయము. జయము. సౌమిత్రి పునర్జీవితుండయ్యె. ఓయీ సుషేణా! ఓషధులెరుంగక వాయుతనయుండు పర్వతమునే పెరికి తెచ్చుచున్నాడు. నీవు సత్వరము జని యోషధుల వెదకి తెమ్ము.

సుషే—ఆంజనేయుని పరాక్రమము కొనియాడ నెవ్వరితరము?
(నిష్క్రమించును.)

రాము—విభీషణా! లక్ష్మణుఁడు జీవించునా? యేటికీయాస.
(హనుమత్సుషేణులు పునఃప్రవేశము)

విభీ—కపీంద్రా! లక్ష్మణకుమారుని శీఘ్రముగా మూర్ఛనుండి దప్పింపుము.

సుషే—చిత్తము. (ఓషధుల ముక్కుదగ్గరనిడి) అయ్యా లక్ష్మణా! ఇంక నిద్ర నుండి లెమ్ము.

లక్ష్మ—(లేచి కోపముతో) ఓరీ దనుజాధమా! పారిపోకు. పారిపోకుము.

ఉ॥ రావణ! సంగరమ్మునకు । రమ్మిక జాలము సేయఁబోకు బల్
కావరమూని నన్ను పటు । కాండమునన్ వెసమూర్ఛబుచ్చితో
బ్రోవగనిన్ను శంకరుఁడు । బ్రోడనటంచును యుద్ధవచ్చినన్
లావరిబట్టి కాలుని పు । రంబున కంపెద నీ క్షణంబునన్॥

రాము—అహా! యిప్పుడుగదా నేను ధన్యుడ. లక్ష్మణా!
(లక్ష్మణ హనుమంతుల పైఁ జేతులు వైచి సంతసమున)

ఉ॥ శోకముచేఁ గృశించి గడు । సొక్కినగాత్రము తాపమూర నన్
ప్రాకత కౌగిలించి యిటు । జూచినయీకటి కార్యమూనెనో
(అని కౌగలించుకొనును. ఆంజనేయునిజూచి)
శాక మృగేంద్రచంద్ర మరి । జానకిజాడలు దెల్పినాడ వీ
భీకరమూర్తి లక్ష్మణుని । బ్రేమదలిర్పగ బ్రోచినాడవో॥

తమ్ముడా లక్ష్మణా! ఓయీ మారుతీ! యిప్పుడుగదా నావ్రతము ఫలించినది. ఇక నాకేమికొరంత. అయిన నిటువినుండు. మరియు నో వాయునందనా! లక్ష్మణా!

శా॥ ఓరీ రావణ క్రూర! దుష్టచ్చుగతు । ల్యా! యింతకాలంబు దు
ర్వారక్రోధవిధిన్ మదించి జగము । ల్బాధించి తీవింక మ

త్కారోగ్రాసి నురంబుచించి శిరముల్ ♦ ఖండించి నిర్జించి హృ
ద్భారంబెల్ల నడంచి శీఘ్రముగ భూ♦తప్రీతిగావించెదన్॥

ఉ॥ ఈసరి దానవాధముని ♦ నే ననియందున దుర్గింపనైతినా
భాసురమొప్ప బక్తిరథ ♦ పార్థివపుత్రుడ గాను కైకజుల్
దోసవిహీను లిద్దరికి ♦ దోహలి లక్ష్మణు కగ్రజుండగా
వాసిచెలంగునట్టి రఘు♦ వంశమునందునఁ బుట్టలేదుగా॥

(తెరలో రావణాసురుడు)

రావ—ఓరీ నరాధమా రామా! పరిపోక నిలువుము.

విభీ—స్వామీ! దనుజాధముఁడు క్రోధోద్రేకమానసుండై దేవరబలంబుల నురుమాడి మిమ్మెదిరించ నిటే వచ్చుచున్నాడు. ఇంక దేవరవారు రణసన్నాహమున నుండురుగాక.

సుషే.—ఆంజనేయా! ద్రోణగిరిని మరల దాని నిజస్థానంబున స్థాపితముజేసిరమ్ము. లేకున్న చో హానికల్గును.

ఆంజ—చిత్తము. అలాగే. (అని నిష్క్రమించును.)

రాము—ఓయీ విభీషణా! మీసోదరుం డెంతమూర్ఖుఁడోయి!

గీ॥ కొమరు లాప్తులు మంత్రులు ♦ సమరమునను
మామకీన శరాహుతి ♦ మడసిరెల్ల
తానుగూడ నశించగ ♦ దరలెనిపుడు
మీరు నెరగలిఁ బడవచ్చు ♦ మిడుతవోలె॥

ఈ దురాత్ముఁడు నాచేత హతుఁడగును సుమా!

విభీ—దేవా! లోకకంటకుఁడగు నాతఁడు జచ్చుటే శ్రేయము.

(ప్రవేశము రావణుడు) (51 అనుబంధము)

రావ—ఓరీ! భీకరాకారుఁడగు రావణుని జయించవలెనని యేనా వచ్చినది? నిన్ను జయించ నేను గావలెనా? మున్ను నాకుమారుండగు మేఘనాథుఁడు నాగాస్త్రము ప్రయోగించ దానిచే బందీకృతుండవై గుడ్లుతేల్చి చూచుచుంటివి గాని దానినుపసంహార మొనరింపవైతివే! ఔరా కోతిమూకలఁగూడి నేనొక వీరుండననివచ్చితివా? నీవు క్షత్రియవంశ సంభూతుండవే యైన నన్ను దురమందు గెల్చి మరలిపొమ్ము.

రాము—ఓరీ!దానవాధమా! క్షత్రియాంశ సంభూతుఁడ నగుటచేతనే క్షత్రియధర్మము గుర్తెరిగి యుద్ధమునకువచ్చితి. కాని నీవలెయబలలను ముచ్చిలుటకు రాలేదు.

రావ—ఏమిరా! నీ శ్రీరంగనీతులు? జగదీశ్వరుండగు రావణుని గుర్తెరుంగవా? ఓరీ

ఉ॥ కోతులఁగూడి వృక్షముల • కొమ్మకు కొమ్మకు నెక్కిదూఁకుటల్
భూతలమేలువాఁడనని • భూరిశరమ్ములఁ గేలఁదాల్చుటల్
హేతువులేక వాలిఁ బడ • నేసి మనంబున సంతసించుటల్
ఖ్యాతి వినాశహేతువగు • కార్యములివ్వి రాచనీతులే?॥

ఆహా! యెంతరాజధర్మవేత్తవురా. (52 అనుబాధము)

రాము—నీవు నన్ను గేలిచేయుచుంటివా? నీరాచధర్మమేమి!

ఉ॥ స్త్రీలను బల్మిబట్టుటలు • ఛీ; యని వారలుబల్క రోయక౯
జాలగ సంతసించుటలు • జారతఁగూడ ప్రధానమంచెద౯
జాలగనమ్మ దిమ్మరికి • సాటియెజూడఁగ సాధులీభువి౯
గూళతనంపుచేష్టలకుఁ • గూడదు నీవిల రాక్షసాధమా!॥

రావ—ఓరీ! సిగ్గులేక బల్కుచుంటివా? నీవు కలుషాత్ముండవని యెఱింగియేకదా! నీతండ్రి నిన్ను కానలకంపి నీతమ్మునికి రాజ్యమిచ్చినది? ఇదిగాక అడవులందుగల యాకలముల మెక్కి యేమూలనో బడియుండలేక తగుదునని యుద్ధము సేయవచ్చితివా?

రాము—ఓరీ! సత్యసంధుండగు మాతండ్రిగారు మున్న పల్కినపల్కుల నిల్ప కానల సంచరించుచుంటిగాని యొండొక కారణముగాదు. భరతుఁడు నాయందొక యధర్మము నిరూపించి యిట్లు జేయలేదు. మరియు,

చ॥ తలపక వేదశాస్త్రముల • దగ్ధముజేయుచు మౌనివర్యుల౯
బలిమిసఁబట్టి హవ్యముల • భక్షణజేయుచు వారిమొత్తుచు౯
గలయికఁబెట్టి విప్రులఁ జా • కాటవుగోవుల దన్కరించుచు౯
సొలయికఁ నాడుబిడ్డల మ • నోజ్ఞత జంపెడు క్రూరులుంటచే౯॥

అట్టిలోకకంటకులఁ బరిమార్ప మాతండ్రిగా రనుజ్ఞ యొసంగుటచే, వచ్చితిని. వారియాజ్ఞపరికార మీ దోషములన్నియు నీయందు బొడచూపుచున్నవి. మరియు కాలమాసన్నమైనవానియందు బొడకట్టులక్షణములు నీయందే బొడకట్టుచున్నవి. కేవలమధర్మస్వరూపుఁడవు. జగత్కంటకుఁడవు నగు నిన్ను వధించుట నా కవశ్య కర్తవ్యము.

లక్ష్మ—ఓరీ దానవాధమా! ఇంకనైన దెలివితెచ్చుకొని యీరాముఁడు భగవంతుఁడని ముమ్మాటికి నమ్ముము.

రావ—ఓరోరి నలువుర ముప్వ్వర బక్కరక్కసుల జంపినంతమాత్రమున నీయన్న భగవంతుం డగునా? నీయన్న భగవంతుండేయైన యొరుల సహాయమేల కోరును? కోరనేపో. కోతులా యీ భగవంతునకు సాయము? ఊరక భగవంతుఁడని యూరజనులెల్లరు నమ్మి చెడిపోదురుగాన యిట్టి నీచపు బల్కులు బల్కకుము.

లక్ష్మ—అన్నయ్యా సన్నిపాతరోగి ప్రేలినట్లు ప్రేలెడి వీనిప్రేలుడు సన్నిపాతమును మీా బాణప్రహారము లనెడియౌషధుల నుపయోగించి వీనివ్యాధి కుదిర్చి లోకుల రక్షించెదరుగాక.

రాము—ఓరీ పిశితాశనా! నేనే నిన్ను జయించవలెనా? నాకు సాయమగు కోతియే,

ఉ॥ తోఁకనుఁజట్టి మున్ను నిను । తోయధు లేడును ముంచె, కోతియే
జోకదలిర్ప నీసుతుల । జోదులఁజంపెను మున్ను, కోతియే
నీక సముద్రముఁ గడచి । నీక సమస్తముఁగాల్చె కోతియే
భీకరమైన నీతలలు । భిన్నముగానటుదన్నెఁ గోతియే॥

ఓరీ! నిన్నన బనిలేదు.

గీ॥ ముదిమిచే మదిజెదరిన । మొదటివేల్పు
నిన్ను సృజియించె లోకుల । వన్నెదరుగ
నైన గానిమ్ము త్వరలోన । నాజినిన్ను
బిలుకుమార్చెదఁజూడు ని । శ్శితిచేత॥

ఓరీ! నీవు నలువచే సురాసుర గరుడగంధర్వాదులచేఁ జావకుండ వరంబు గోరితివిగాని, నరులచేతను వానరులచేతను జావకుండునట్లు గోరలేదు. అది గ్రహించి నే నినకులాగ్రగణ్యుండగు దశరథేశ్వరునకు సుతుఁడనై జన్మించితి. దేవతలెల్లరు నీకొరకై వానరులై జన్మించిరి. ఈ వృత్తాంతమంతయు తొలి నారదుండు నీ కెఱిఁగించినను మదాంధకారముచే కన్నుఁగానక నాకే యుపకారమొనర్చితివి. ఓరీ నిశాచరా! ఇప్పుడైన నది గ్రహింపజాలక మేరమీఱి ప్రేలుచుంటివి. నీయెడ కారుణ్యమువీడి నిన్ను ద్రుంచుటయే నాకు కర్తవ్యము.

ఓరీ! దానవాధమా!

గీ॥ వలిమలల్లుఁడో లేక న । వ్వనజభవుఁడో
జలజనాధుఁడో నిన్ను ర । క్షణము సేయ
దలచివచ్చినరానిమ్ము । దర్పమడచి
నా శరాళికి నిన్నర్ప । ణంబుసేతు॥

రావ—(కోపముతో) ఓరీ పశువా! నీప్రగల్భములతో నేమిపని? నీవు దశరథుని కొమరుఁడవేమైన నన్ను గడతేర్చిపొమ్ము. లేకున్న తొలగిపొమ్ము.

[తెరలో]

రావణాధముడు జావవలెను! చావవలెను! రఘుకులరత్నమా! శీఘ్రముగ,

గీ॥ సాహసముజూపుమిదె మంచి । సమయమయ్య
రణముజాలించి శీరసు । రామచంద్ర

దానవారణ్య ఘోరదా ♦ వానలంబు
నైనబ్రహ్మాస్త్రమును మంత్రి ♦ మూనిబంపు॥

రావ—ఓరీ! సురలుకూడ వీనికే సాయము సేయంగ సాహసించినారే! కానిమ్ము. ఈనరాధముని ముందువధించి పిమ్మట దేవతలతోఁ బెనఁగెద. (అని శరము వేయును)

రాము—(కోపముతో) ఓరీ జగత్కంటకా! దేవహింసనా! ఇదిగో బ్రహ్మాస్త్రమును బ్రయోగించుచున్నాడను.

చం॥ మదమున గన్నుమిన్నగక ♦ మాన్యులఁగష్టము బెట్టుటెల్లనే
నిదివర కచ్చటచ్చట వి ♦ నే మఱియూరకనుంటిఁ గారణం
బదిగదియుంగ నీవు జన ♦ కాత్మజ దెచ్చితి వింతలోన నీ
కదనమునందు లక్ష్మణుని ♦ గందగ జేసితి వౌర యిప్డు నా
మది నదనంచు నెంచి యను ♦ మానము వీడితి నిన్ను ద్రుంపఁగన్॥

(అని బ్రహ్మాస్త్రము వేయును)

రావ—శివ శివా! (అని క్రిందపడును)

లక్ష్మ—సూర్యనందనా! ఇంక హతశేషంబులను దునుమాడుదము రండు.

సుగ్రీ—చిత్తము.

(అందరు నిష్క్రమింతురు. యవనిక పడును.)

తురీయరంగము—లంకాపట్టణము

(రామ, లక్ష్మణ, హనుమత్సుషేణాంగదుల ప్రవేశము)

(53 అనుబంధము.)

రావ—లక్ష్మణా! రావణవధచే లోకమంతయు భయంబుమాని విభీషణ పట్టాభిషేకమహోత్సవము జరుపనెంచి పురజనులెల్లరు సంతోషస్వాంతులైరి గదా!

లక్ష్మ—చిత్తము. దేవరవారు సంకల్పసిద్ధులు గదా! దేవరవారికి మీరినకార్యమేదిగలదు?

రాము—లక్ష్మణా! విభీషణుఁడింకను సీతను దీసికొనిరాక జాగుసేయ కారణమేమైయుండును?

లక్ష్మ—అన్నయ్యా! అదిగో జనకజసమేతుఁడై పుష్పకవిమానారూఢుఁడై వచ్చుచున్నాడు.

(అంత విభీషణుఁడు సీతతో ప్రవేశము)

సీత—లోకకంటక దశకంఠకంఠవిలుంఠనా! దశరథనందనా! నమస్కారము (అని పాదముల పట్టుకొనబోవును) (54 అనుబంధము)

రాము—(కోపముతో) జానకీ! నాకు కడునవ్వుపు నుంచుము. నన్నంటుట కష్టారా

లవుగావు రేమేలయున. (55 అనుబంధము)

గీ॥ కోమలులయందు నొప్పుల ♦ కుప్పవైన
నిన్ను రక్కసి గొనిపోయె ♦ సన్నుతాంగి
వాని మోహముదీర్చక ♦ వదలెఁగాన
నందరిటఁజూడ నిన్గొన ♦ నిందగాదె?

మరియు నోసీతా! ఇందుగలవారు వీరు. ఇటుజూడుము.

ఉ॥ ఈతఁడు సూర్యసూతి, మరి ♦ యీఘనుఁ డంగదు డంగనామణీ!
ఈతఁడు లక్ష్మణుండు, మరి ♦ యీఘనుఁ డంజనిపుత్రుఁడో భామా;
ఈతఁడు లంకనేత, ప్లవ ♦ గేశ్వరు వైద్యుఁడీతండు, చూడుమా
ఈతరి వీరిలోనొకరి ♦ నిష్టముదీరఁగఁగోరుభర్తగా॥

(తెరలో)

పాపము శమించుగాక! పాపము శమించుగాక! సీతామహాదేవి సాధ్వీ శిరోమణి! ఆమెపై నింద మోప లోకములు క్రుంగిపోవును. సత్యము. సత్యము.

సీత—తల్లీ! అశరీరవాణీ! నాచరిత్రయంతయు నుడువుము. నాథా నన్ను స్వీకరింపకపోయినను అశరీరవాణి సత్యవాక్యములనైనా స్వీకరింపుడు.

రాము—నే నశరీరవాణిని నమ్మెను. నిన్నును నమ్మెను.

సీత—కరుణాకరులని పేరుగాంచి నాయెడ నింత కాఠిన్యమూనుట చూడ నాకర్మమని తలంచెద. నాథా! పరిణయమైనదాదిగా నన్ను ప్రేమమీఱ గాచి నా గతి యంతయు నారసి నేడు నాపై దోషమారోపించినచో లోకులూరకుందురా? దేవా! మీ పాదములసాక్షిగా ముమ్మాటికి నేను నిరపరాధిని. ఇంకను నమ్మరేని యీ యపవాదు నేభరింపజాల. కాన మీఖడ్గముచే జంపుడు. లేకున్న నగ్నిప్రవేశమయ్యెద. అనుజ్ఞ యొసంగ వేడుచుంటిని.

రాము—జానకీ! నీవు సుచరిత్రవే గావచ్చును? కాని నీపై మోహముచే నారక్కసి నిన్నుగొనిపోయె. నీపై భ్రాంతిగలవాడనై మందమతిచేత నిన్ను మరల రావించితిని. ఈపట్ల నిన్ను గ్రహించితినేని యీ లోకులెల్లరు నన్ను నిందించెదరు. ఇదియటుండ లోకమున కొక యనాచారమున కుసికిపట్టు జూపినవాఁడనగుదును. కాన నిన్ను ముమ్మాటికి స్వీకరింపనొల్లను.

సీత—నాథా! నన్ను మీరనుగ్రహించకున్న నాకు మరణమే శరణము. కాన పావకునిలో నైక్యమయ్యెద సెలవొసంగుడు.

రాము—మంచిది! అట్లనే సేయుము. ఓయీ హనుమంతా! నీవుపోయి కాష్ఠముల బేర్చి యగ్నిని బ్రజ్వరిల్లునట్లు జేయుము.

అంజ—స్వామీ! లంకయందుండినను యీమె పాతివ్రత్యమునే యాచరించినది.

రాము—(కోపముతో) చాలుచాలు. నాకు నీవు నీతులు నేర్పవచ్చితివా? ఇనకులోత్తము లధర్మమునకు లోబడరు.

లక్ష్మ—అన్నయ్యా! చిత్తగించుము. జానకి మహాసాధ్వి. ఈమెపై నిట్టి కూ్రగమాపాదించ దగదు. కాన నీ పవిత్రురాలిని గ్రహింపుడి.

రాము—(కోపముతో) మీరందరు నాకు నీతులుచెప్పనక్కరలేదు. మీధర్మోపన్యాసము లింకకట్టిపెట్టుడు. యేమీ ఆంజనేయా నీకిష్టములేకనా యేమి? ఆలోచించుచున్నాడవు. నాయాజ్ఞ యనాచరణీయమని సందియంబుగల్గిన యాకార్యము నేనే నిర్వర్తించుకొనియెద. నీవు పొమ్ము.

ఆంజ—(చెవులు మూసికొని) హరి హరీ! స్వామియాజ్ఞ యెట్టిదైనను నెరవేర్చవలెనుగదా. (నిష్క్రమించును.)

యవనిక పడును.

---

[పంచమరంగము. మండుచున్న అగ్నిగుండము.)

(సీతా రామలక్ష్మణ, సుగ్రీవాంగదాదులు ప్రవేశము.)

సీత—

చం॥ ఇనకుల వార్ధిచంద్రమ న ♦ రేశ్వర శ్రీ రఘురామచంద్ర నే
ననయము నీ పదాంబుజము ♦ లాత్మనుతించు చహర్నిశంబులన్
మనమున మిమ్మదక్క నొరు ♦ మాటదలంపని దాననైన నీ
యనలుఁడు చల్లనై యిట స ♦ హాయము జూపి బ్రసన్ను డయ్యెడున్॥
(నమస్కరించును)

రాము—మంచిది, అట్లనే గానిమ్ము.

సీత—

చం॥ స్థిరమతులార! యోసకల ♦ దిక్పతులార! త్రిమూర్తులార! కి
న్నరవరులార! కింపురుష ♦ నాగకులోత్తములార! దేవఖే
చరవరులార! సిద్ధముని ♦ సత్తములార! సుసాధ్యులార! భా
స్కర యమృతాంశులార! గురు ♦ కారణ భూతములార! బ్రోవరే॥

గీ॥ మీరలందరు సాయ మ ♦ మేయమతిని
సేయఁగల ప్రార్థనము మది ♦ జేయుదాన
గాన నే సాధ్వి నగుటీజ ♦ గాన నెఱుఁగ
నట్టి పుణాత్ము లెవరని ♦ యుందునకట॥

తండ్రీ పావకా! నానాధుఁడు నాయెడలేని దోషము నిర్ణయించి నిందపాలొనరించె. నిట్టి యపఖ్యాతి నొందుటకన్న మరణమే శరణము. ఓ పవననెచ్చెలీ!

ఉ॥ రాముని నామమంత్రము ని ♦ రంతముగా నే జపియించుచుండు నేని స
త్ప్రేమ మనారతంబు రఘు ♦ వీరుని యందు ఘటించు నేని యీ
భూమిజ నైతినేని పర ♦ పూరుషులన్ మదినెంచ నేని నా
నోములు నీమములు వ్రతమ ♦ నూనత వెల్లడిఁ జేయు మిత్తరిన్॥

చం॥ అనలుడ! సందియంపడక ♦ నాపతి గాఁ గొనుమయ్య వేడుకన్
నను మహనీయులందరుఁ గ ♦ నన్ గరుణారస ముంచి సత్వరన్
మనుకుల మూర్తిరామునకు ♦ మానిని గాఁగను జన్మ జన్మ మం
దని మదినెంచి నీయుదర ♦ మందునఁ జొచ్చెద హవ్యవాహనా॥

(౯౬ అనుబంధము)

(అని అగ్నిగుండమునందు దుముకును. అగ్ని చల్లారును)

రాము—అయ్యో! మైథిలికి బ్రమాదము సంభవించినది లోకమునకు భీతిజెంది నేను నిరాకరింప సీత యెంతపనిజేసినది. అన్నన్నా! అయ్యో సీతా! యీప్రళయాగ్ని చల్లార్పనా? సాధ్యమగునా? అయ్యో నేనాలోచించు నంతలో సీత నీరగును గదా. ఛీ. ఇంక బ్రియకాంతతోడ నేనును కృశానుని జేరెద. (అని లేచును) ముందుకుజూచి యేమి యీవింత!

ఆ॥ వె॥ అగ్ని చల్లనైన ♦ యట్టులగన్పట్టు
జ్వాలలేవి సీత ♦ జాడఁజూడ
జిత్రమయ్యె నాకు ♦ సీతచరిత్రంబు
కలయొ లేక భ్రమయొ ♦ గాంచనిపుడు॥

(అంతట అగ్నిదేవుఁడు సీతతో ప్రవేశము)

అగ్ని—రామా! రవికులసోమా! సకలాంతర్యామివైన నీవు జెడునీతి నిట్టి యనాచారము లాచరించితివేమి? పతివ్రతామతల్లియగు యీకల్లిస్పర్శచే వీతిహోత్రుండనగు నేనే పవిత్రుండనైతి. ఇంక నీవు శంకించక యీ సాధ్వీశిరోమణిని స్వీకరింపుము. నాపలుకులుగూడ నసత్యమని తోచిన మిమ్ము స్తోత్రముచేయ విమానారూఢులై యింద్రాదిదేవత లిటేవచ్చుచున్నారు.

(అని నిష్క్రమించును)

(అంతట బ్రహ్మేంద్ర మహేశ్వర దశరథులు ప్రవేశము)

బ్రహ్మ—దశావతారధారీ! జయతు జయతు.

రాము—సర్వసృష్టిధీరా! పితామహా! వందనములు.

శివుడు—రావణాంతకధీరా! జయతు జయతు.

రాము—గిరిజాసుతా మనోహరా! హరా! వందనములు.

ఇంద్రు—దనుజాంతకా! వందనములు.

రాము—నాకపురాధీశ్వరా! స్వాగతము.

ఇంద్రు—రామా! సంగ్రామభీమా! నీవిజయమున కమందానందహృదయారవిందుఁడై నీతండ్రి దశరథేశ్వరుఁడు వచ్చియున్నాఁడు.

రాము—(తత్తరపాటున జూచి) పుత్రశోకమున దివికేగిన తండ్రిగారి కిదే నమస్కారములు.

దశ—తనయా! రాజ్యాభిషేకమస్తు.

లక్ష్మ—తండ్రీ! సుమిత్రా పుత్రుఁడిదే వందనము లాచరించుచున్నాఁడు.

దశ—వత్సా! దీర్ఘాయుష్మంతుఁడవు గమ్ము.

సీత—స్వర్గనివాసులగు మామగారి కిదే వందనములు.

దశ—కల్యాణీ! పూజ్యులగు పుత్రులను బడయుము. (రామునితో) నాయనా! ఈమె చరిత్రమంతయు నెరింగియు నిట్టులాడుట నీవంటి ధీనిధులకు తగునా?

రాము—తండ్రీ! యిందుకు నన్ను క్షమింపుము. ఏలనన అసురాలయమం దిన్ని దినంబు లుంటిగనన్న యీ సీతను గూడి నే నయోధ్యఁజేర బౌరులెల్లరు నిందజేయుదురను తలంపుతో నిట్లొనర్చితి. అగ్నిదేవుఁడు సైతము యీమె పాతివ్రత్యమునకు సంతసించి సర్వము నెరింగించి చనియె. కాని యీమె యందు దోషమున్నదని యిట్లొనరించలేదు. ఇందువిషయమై జానకికూడ సంతసించవలెను.

సీత—నాథా! భవదీయ సన్నిధానమే నాకు ముదావహము.

బ్రహ్మ—రామచంద్రా! లోకకంటకుండగు రావణాసురుని సంహరించి, సర్వజంతుజాలమునకు మేలొనగూర్చితివి. ఇంక నీ వయోధ్యకుం జని పట్టాభిషేకమహోత్సవ మొనరించుకొనవలయును.

రాము—చిత్తము.

ఇంద్రు—దేవా! నే జేయవలసిన కార్యమున్న సెలవొసంగుము. నిర్వర్తించెద.

రాము—అయ్యా! శచీధవా! నానిమిత్తముకొందరు వానరులు మృతినొందియుండిరి. వారి కమృతవృష్టిచే బ్రాణదాన మొసంగుము. ఇదియే నాకోరిక.

ఇంద్రు—చిత్తము, కుంభకర్ణునిచే మ్రింగబడిన వానరులు దక్క, తక్కిన వారు పునర్జీవితులయ్యెదరు గాక!

దశ—లోకమాతా! సీతా!!

గీ॥ పతియె దైవతమగు నెందు । పడఁతులకును
పతియె బంధువు బ్రాణంబు । పరమహితుఁడు
గాన శుశ్రూషఁజేయు నీ । క్ష్మాతలమున
నతివ చరితము గొనియాడ । నర్హమగునె?॥

మరియు, భుజబలాఢ్య సంపన్నులును, పరమపవిత్రులును, ధీనిధులునగు, బుత్రులబడయుము.

శివు—దశరథనందనా! మేము స్వర్గమునకు బోవుచున్నారము. కమలగర్భుడు విధించినట్లు నీ రాజ్యమునకు బోయి, పట్టాభిషిక్తుఁడ వగుము.

రాము—చిత్తము.

(బ్రహ్మేంద్ర దశరథ మహేశ్వరులు నిష్క్రమింతురు).

రాము—విభీషణా! జాగుసేయక యయోధ్యకు బ్రయాణము కమ్ము.

విభీ—చిత్తము. కౌబేర పుష్పకవిమాన మిదివరకే సిద్ధము జేసితిని. దేవరవారు దాని నారోహింతురు గాక.

రాము— మంచిది. దానినెక్కి యెల్లర మయోధ్యకు పోవుదము.

విభీ—చిత్తము. మహాప్రసాదము.

రాము—ప్రియకాంతా! జనకజా! (సీతపైన జేయివైచి)

సీ॥ సుందరి నీవయి ♦ నింద మోపితినని
కుందకు నీమది ♦ మందగమన
కొందరజ్ఞులు ముఁదు ♦ నిందింతురంచు నీ
చందంబు జేసితి ♦ కుందరదన
యిందు నిక్కపుటీలు ♦ నందరకునుజూపి
వందితురాలవై ♦ యిందువదన
పొందుగా నిను వేడి ♦ బృందారకులుముదా
నందులై చనిరి ♦ యిందనయన
గీ॥ డెంద మునననున్న చింతల ♦ సందియముల
నందముగ వేడ దరుచర ♦ బృందసహిత
మందర మయోధ్యకేగి యా ♦ నందముగను
నుందమికరమ్ము బందుగుల్ ♦ సందడింప॥

(యవనికపతనము. అందరు నిష్క్రమింతురు).

షష్ఠమరంగము.

---

(అయోధ్యానగరము- పట్టాభిషేక మంటపము).

(సీతా, రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులును, వశిష్ఠ విశ్వామిత్రాది మునీశ్వరులును, సుగ్రీవ, విభీషణ, హనుమదాంగదాది వానర ప్రముఖులును, మరికొందరు పురజనులును ప్రవేశము.)

విభీ—కర్పూరము వెలిగించి,

మంగళమహాశ్రీ వృత్తము.

మంగళము రామునకు ♦ మంగళము మైథిలికి ♦ మంగళము పూజ్యులకు వేగ
మంగళము మత్తనుమారుకొనురక్కసుల♦మాఱుడు రామునకు వేడ్క

మంగళము మౌనికుల ¦ కుండితున కెల్లదగు ¦ మంగళము వానరుల కెల్లలకా
మంగళము భక్తులకు ¦ మంగళము రాజులకు ¦ మంగళము మంగళ మహాశ్రీ ॥

రాము—(లేచి) ఓ సభాస్తారులారా !

చ॥ నెలనెల మూడువానలిల ¦ నిక్కముగా వరిషించుగాత, ని
య్యిలగల సస్య సంతతులు ¦ నింపుగ పంటల నిచ్చుగాత స
త్పరమ పతివ్రతామణులు ¦ భక్తినినాథులగొల్తురిగాత నే
యలజడిలేక భూమిపతు ¦ లందరునన్ సమదృష్టిజూచుతన్॥

భరతవాక్యము:—

ఉ॥ వేసుకమీర బండితులు ¦ వేలకొలంది రసధ్వనుల్ దగన్
గూడిన గ్రంథరాజముల ¦ గూరిమితో నొనరింతురి గావుతన్
గూడుకు కోటయాహ్వయుడు ¦ కూర్చిన శ్రీరఘురాము సత్కథన్
బాడిన యాడినన్, భవవినాశము ¦ మోక్షము, గల్గు ధారుణిన్॥

(యవనిక పడును)

షష్ఠాంకము సంపూర్ణము.

గద్య.

ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష లబ్ధకవిత్వ భారద్వాజసగోత్ర బోధాయనసూత్ర
గూడూరువంశ పయఃపారావార రాకాసుధాకర మల్లేశ్వర పౌత్ర నిరంతర శివా
రాధన వేంకటశివ కవీశ్వ రాంబమాంబికా సుపుత్ర సుజనమిత్ర
కోటీశ్వరనామధేయ ప్రణీతంబైన

శ్రీ

సంపూర్ణ రామాయణము
సంపూర్ణము.







శ్రీరస్తు



# సంపూర్ణరామాయణము



## అనుబంధము

1 బిలహరిరాగము—ఏకతాళము.

విశ్వా— పనుపవా - దశరథా - నావెంట - నీజంట
నేఁగొంట - నీజంట - పనుపవా
లోకంబులన్ - వడంకన్ - శేయుకౌశికున్ - మెరుగవా-
జాలము - పీడియు - బాలురబంపుము
వేళాయె - బోమెద - వెడగులుచాలించి॥ పను ॥

2 కమాసురాగము—ఏకతాళము. డైలాగు.

రాము— జనకామమ్ముల బిలువగనేలొకో - మనములోన
నేమాటనుదలచితో - అజుదునేనున్ - యరసియు
దానిన్ - యవలిగానున్ - శిరమునదాల్తుము॥ జన ॥

లక్ష్మ— మానియెవ్వరో మాకును దెల్పుము - మాటలాడగను-
మమునేజూచును - మనమునదా ఘనముగయో-
చనలనుసే - యుచునుండెనిటన్ ॥మా॥

దశ— కౌశికుడితడు క్రితువును శేయన్ - కామరూపులు
దనుజులుదానిన్ - ధ్వంసముసేయన్ - దానినిగాయన్ -
త్వరగను జేరెన్ - మిమ్ములగోరెన్ ॥కౌ॥

విశ్వా— జాగుచేసెదవు సమ్మతిలేదా - సరగునదెలుము -
సభికులువినగన్ యేగెద;యీదన్ - జాగునువీడన్ -
నేనిక వేదన్ - నిన్నికజూడన్ ॥జా॥

3 బేహాగ్రాగము—ఏకతాళము.

రాము— సెలవొసగు మాకింకనో - జనకా ॥సెల॥
జన్మముగాధియు - సంయమియాజ్ఞయు -

తిన్నాగవినియుండెదర - మన్ననలను బొందెదర ॥శ॥
మదిలోనగుంకకా - దిగులూను బొందకా
యెదలోన హర్షించుమా - సదయుత మముబంపుమా ॥శ॥

మధ్యమావతిరాగము—ఏకతాళము.

అహల్య— కౌసల్యాసుత - కాననమందున - ఘనతనరాయిగ - గల్గిననన్నిక ॥
కావుననన్నిక - ఖరకరవంశ - కంబుజాముఖ -కరు
ణాసాంద్రా - సుందరాననా - సురనుతపాత్రా -
సూరిజనార్చిత - సుచరితరామ ॥కౌ॥
రక్కసిమూకల - నుక్కగగూల్చిన - భీమానినువడి
గొలిచెదరామా ॥కౌ॥
గౌతమవర్యుచే - గలిగినశాపము - కాననమందున
ఖండనజేసి - రాతిగనుండిన - నాతిగనజ్జేసి - రక్షణజేసిన
రామ - శ్రీరామా ॥కౌ॥

5 బేహాగ్—ఏకతాళము.

విశ్వా— శివువిల్లునెక్కిడెదున్ - హాయ్ - హాయ్ ॥శివు॥
అష్టాదిక్పతులార - స్పష్టముగా - గాంచుడి ॥శివు॥
మూనిపుంగవులార - మూరామచంద్రుడు ॥శివు॥
కౌశికమూనీంద్ర - కరుణించి సెలవిమ్ము ॥శివు॥
జనకజరాజేంద్ర - సభికులుతోషింప ॥శివు॥
హే! లోకనాటకధారీ - పరబ్రహ్మస్వరూపా - కృపగననే;
(విరచి)
శివువిల్లునే విరచితిన్ - హాయ్ - హాయ్ - శివు॥
దివ్యామతులు నాదు - తేజువ తిలకింపుడీ॥ శివువిల్లు॥

6 అందరు

శ్రీరామరామ - జానకీరామ
అయోధ్యరామ - ఆహోవభీమ - శ్రీరామ
కోదండరామ కోర్కెలధామ
పట్టాభిరామ - పావననామ - శ్రీరామ
జలధరుని విల్లు - సరగూనద్రుంచి
యిలలోన కీర్తి నందినరామ - శ్రీ॥

7 పరశురాముడు—బేహాగ్ - ఏకతాళము.

పరశురాముడంచు నేను - పరగియుండ - పుడమిపొందు
వీరుడెవడు - కనలిర॥పర॥

రాముడైన - గీముడైన - భీముడైన - గానివాని
కదనమందు - కదలకుండ - మెదలకుండ - కశియాడదీర్చుదరా॥ పర॥

8 మంధర

రాజ్యాధిపత్యము - జేసిననాకేంతో - కోపము - రాము - రాజ్య
కౌసల్యకు హాయ్
తోషం - భరతునదే దౌర్భాగ్యం
కైకకు ప్రాడిగం- భరతుని సేవకం॥ రాజ్య॥
ఆహాహా! కైకజా - కార్యముచెడెనయ్యొ భూమిజా!
కౌసల్యకు మదమిటహెచ్చెగా - యికరాముడె రాజటజూడగా
యువరాజట లక్ష్మణుడెన్నగా - కైకకునాకుగా
కష్టమువచ్చెగా॥ రాజ్య॥

9 డైలాగ్

కైక— ఓరోర - చాల్లే - తలపులు దెలిసెగా
పురుషుల నమ్మగ దగదిక పొమ్మా ॥ఓ॥
అక్కరదీరెగా - అతివలజూడగా - ప్రక్కకురాకగా
నక్కయుపోవగా - పురుషులకిదియగా - పరువగనదియగా
అరుగుముజూడగా - ఆకౌసల్యగా॥ ఓ॥

దశ— ఓహోహాహో - ఇదియేం - కోపము - సఖియా
ఆహాహా కైకా - అంతయునీదెకా॥ ఓ॥
పేరుకునదియే - పెద్దది సుమిత్ర
పెరిగెను నీపై - మరుగకు ప్రేమా
యిట్టులుబల్కుట - ఇదినీకు తగునా
గట్టిగనమ్ముము - కర మిటుదెమ్మా॥ ఓ॥

10 డైలాగు.

దశ— తరుణిరో నమ్మము - తగ వేలనింకను
కోరినవరముల - కొనుమిదె యిచ్చెద॥ త॥
భానుడు శశియుల - బాటయుదప్పిన
సూనులు - రాజ్యము - శూన్యతనొందిన
భానుకులంబెల్ల - భంగమునొందిన
మానిని - సత్యము - మాననుమానను
పట్టభద్రుజేయుడిలా - భరతపుత్రునొక్కటగా
పట్టువిడిక రామువనికి - పదియునాలుగేడులా

బంపుడు వేగ మె-యింపౌను నాకింక
యువియేను వరములు-యింతి యేజాలును॥ పట్టభద్రు॥ .

11 బేహాగ్—ఏక తాళము.

రాముడు — నాదు-జనకాజ్ఞమీరక-సత్యమునిల్పగను-నే-కానలకేగెదను॥నా॥
కైక వరములదీర్పగను- నాదు వందనములగొను-జనని-
దీవనలొసగినను-పనుపుము-వేగముగ-భయమింక వలవదిక॥నాదు॥

12 జైలాగు.ఫీలురాగము—ఏక తాళము.

రాము— అమ్మయిక మదిలోన-దిగులునుబొందకే-
దిగులునుబొందకే-వగచేతగుందకే॥అమ్మ॥
కౌస— తండ్రియెటు నినుబాసి-ధరమీద నిల్తురా
ధరమీద నిలుతురా-తాళగజాలరా॥తండ్రి॥
రాము— కాలకర్మ దప్పిచనగ-ఘనులకు దరమటే
ఘనులకు దరమటే-మునులకు వశమటే॥అమ్మ॥
కౌస— యేలయిటు వనికేగ-యేలక భూమినిన్
యేలక భూమినిన్-వెలగజేసినన్॥తండ్రి॥
రాము— జనకుని యాజ్ఞనేను - ఘనముగ దీర్తుగా
ఘనముగ దీర్తుగా - మనమును బొంగగా॥అమ్మ॥
లక్ష్మణుడు— 13 ఇంగ్లీషునోటు—ఏక తాళము.
కసిదీర్చెదన్ - అసిధార చేన్ - వెసబోవనేన్ - పసమీరగన్-
భరతున్ - గిరతున్ - భస్మముచేతున్ - కైకన్ - గియుకన్-
గసిమసి జేతున్॥కసి॥
మదంబంతేన్ - మహిన్ దగ్గన్ - జనుల్ చూడన్ - శబాసనగన్-
మాయలమారినీ-మర్మము దెలిసెను-మంచిది సౌమిత్రి దుంచదే॥కసి॥
రాముడు— 14 ఇంగ్లీషునోటు—ఏక తాళము.
భూతమునీకిటు - పూనెనో బలుకను
పాతక మెంచక - పానము జేసితో॥భూ॥
సత్యముబల్కుట - పైత్యముబుట్టెనో
నిత్యము లేని యీ - నీ తెలగల్లెనో
మాతనుగూర్చియు - నీతినివిడచి
భాతిమెబల్కుట - భావ్యమా లక్ష్మణా॥భూ॥
సీత— 15 బేహాగ్ రాగము—ఏక తాళము.
నన్నింక గొంపోగదే - కానకు॥ నన్నింక॥ఇన్నాతినిన్ వీడకే-
శ్రీరామ - శ్రీరామ॥ నన్ని॥

మిమ్ములవీడినే - నిమ్మహియుండనే| సెలవిచ్చిగొంపోగదే - ప్రాణేశ
వీడుట - బాడియకే - ఘనమానీంద్ర - చంద్రానుతా॥ నన్నింక॥

రాముడు— 16 మలయమారుతము—ఏకతాళము.

అచలాత్మజా - యేటికోరికే॥ అచ॥
ఘోరకాననముల్ - జేరియుండవలె - నరులందులేరు-
నానాజంతుసమితి ॥అచ॥
కందమూలముల _ గాసిబొక్కవలె
కుందరదన - కూడునీళ్ళులేవు ॥అ॥
నడువజాలకవు - బడలిపోయెదవు
యుదురాజముఖీ - యుంపుమింటికడ ॥అచ॥

భరతుడు— 17 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

నాథునిజంపిన - నాపాలిరక్కసి
భేదముజూపియు - బెద్దలబాపితే ॥నా॥
సీ! నాలుకచీల్పను - నా కేలరాజ్యము-
కానకుబంపితే - జానకిరాముల
సిగ్గేలలేదాగా - శిరమెత్తనీకిట-
పగ్గియచూపితే - పాపిని కైకే ఛీ॥నా॥

శత్రుఘ్నుడు— 18 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

శాంతము బూనుము - స్వాంతమునందున
చింతను విడిమాత _ శిక్షింప జెల్లున
మాతహంతకులంచు - భ్రాత రాముడుబల్కు
ఖ్యాతికి - మోసము - నాతిని - జంపగ ॥శాం॥

రాముడు— 19 ముఖారి రాగము—ఏకతాళము.

ఈశా - సర్వేశా - ఇపుడెది - దిక్కుమాకు - ఈ॥
అతివను గూడినే - నడవికి వచ్చితి - గతియెటులుండెనో - గననా
వశమా॥
బాలా _ సీతా - ఈలా - వనిలో - బేలా - యయ్యె - జాలీ-
లేదా॥ ఈ॥
పావుడనేనిల - పగతుని రీతిగ - తాపముబెట్టితి-ధరణిజకిట్టులు ॥ఈ॥

లక్ష్మణుడు— 20 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

మింటను ధూళిట _ మిక్కిలి లేచెను
వెంటనె వచ్చెగ - వేగమె భరతుడు॥మిం॥
కావరమెచ్చియు - కన్నుమిన్గనకుండె

భూవర సెలవిమ్మి - బూది యొనర్చెద -
సాయము లేకనే - సాధించి వేధించి
దాయాది యనకను - దండిం ఖండింతు
దుష్టుడు - భ్రష్టుడు - కష్టుడు - కైకజుడు ॥ మిం॥

భరతుడు—
21 కమాసు రాగము—అదితాళము.

నన్ను బ్రోవవే - రామా - దయచేత ॥నన్ను॥
అన్నరో - నాదుతప్పు - తెన్నుల - సన్నుతింతు- నన్ను
తల్లియుటు బల్కవనికి - వెళ్లనీక ధర్మమౌనె -
పెల్లుగాను యిందరిని - గొల్లుమన సేయునౌనె ॥నను॥
అన్నరో - రాజ్యరమను - చెన్నుగ - స్వీకరించి - మన్నాక
తప్పులింక - పన్నాగభరతునింక - అన్నా - దయజూచి ॥ నన్ను ॥

భరతుడు—
22 మోహన—ఏకతాళము

తెమ్మా - మీపాదుక - లర్చననుసేయగ - భక్తియుదప్పక
రక్తియునిలువగ - ఘనమౌని - చంద్రధరవందితా ॥తెమ్మా॥
బిడ్డలగలిగను - బీరితిగ బ్రిజలను -
దొడ్డగ నేలెద - దొరతనమునవె ॥తెమ్మా॥
దోసము లేకనే - వాసిగ పదముల -
రసికత గొల్చెద - రామ శ్రీరామా ॥తెమ్మా॥

సీత—
23 కాఫీరాగము—ఏకతాళం

నాకింక తెచ్చివ్వరా - బంగరులేడి ॥నా॥
ఆ కులుకుచూపుచే - అతళుకు మేనిచే -
ఆనందమును మీరె - జనుము - కనుము - జాగువిడియు ॥నా॥
మేలిమి కళుకుల - మించుండె గనుమది-
పాటిన విడకుండ - బట్టి - కట్టి - నిట్టువేగ ॥నా॥

రాము—
24 జంఝూటిరాగము—ఏకతాళము

వహ్వారె యాహారిణి విచిత్రం - వహ్వారె యాహారిణి
తమ్ముడా - ఆనంద మాయెనుగా - విచిత్రం - ॥వ॥
మున్ను బలికితి - నన్నరో దేవికి - యిష్టంబుగా - దీరుతుననుచు ॥వ॥
లేడిని వేగమె - లేమకునిప్పుడు - పట్టివ్వగా - జనుమా-లక్ష్మణా ॥వ॥

లక్ష్మణుడు—
25 హి. తోడి—ఏకతాళము.

చింతిలకమ్మా - శ్రీరామునకై నీవు ॥చిం॥
జనకవిభుని ప్రియతనుజా - నాదుమనవి వినుమిదె భూమిజా॥
అనఘుండగు నీదు రమణుడు - లేడిని నిట్టు దెచ్చుచుండె ॥చిం॥

సుదతీ - రామునిరాణీ - సూనృతమూడెదు వాణీ
మదిదిగులును బొందనేల - మానుమమ్మ యీవగపేలా॥
అవక్రవిక్రమ పరాక్రముండగు - రఘూత్తమునకే యాపదవచ్చు
నమ్మా॥
నీమదిగలదుఃఖమును వీడు - క్షేమమేగదమ్మా॥
వినిమెద - జనియెద - వనినే - జూచెద ॥చిం॥

26 జైలాగు ఫేలు—ఏకతాళము.

సీత— అనుజ - దనుజు - తేరి - వచ్చితిరా - యిదిమేరా - మదివేరా -
వినవేరా - ఓబుద్ధిహీనా - రామునిగానా - తానడయందున - జూడ
జనవేరా - స్వాంతము లేదా - పోవేమివాదా - కపటమతుడ -
కానుము జడుడ ॥అ॥
అన్ననిట్టులవీడుట దగునా - అయ్యోయేమిది పలుకవుతగునా - యింత
కూరమా - గనగమోసమా - నన్నుబట్టుటకు - నీదుతలన్నమా -
ముట్టదరమా - దుష్టజనమా - గనియురమ్మ - రామునింక ॥అ
లక్ష్మ— రామరామ - జానకీకామ - నేడునన్ను బ్రోవుమ - మనవివినుమా -
అయ్యయ్యో యీపరుషంబులేల - అలింపజాల - పాలింపు రామ ॥
నేనింకయీలా - జీవించనేలా - ప్రాణమువీడా - నుంటి నీవేళా ॥రామ॥
అదుదనీవికవుము - నీవింకసీత - ఆరాముడిటవచ్చునమ్మింకమాతా
చింతించదగదింక జనకజాతా క్షేమమెరామునకుస్థిరముభూజాతే ॥రా॥
భూమిదుహితా - రామువిహితా - వినుగరితా - యేలనువంతా -
కనునాగతి - సుజనహితి - రాముఖ్యాతి - రమణి - సుమతి ॥రామ॥

లక్ష్మ— 27 ఫీలు—ఏ తాళము.

ఇటుమీరిరాకుసుమమ్మా - యీగిరిగనినిలుమమ్మా ॥ఇ॥
ఈయటవి దుష్టరక్కసుల కునికిపట్టమ్మా
వాండ్రుమాయవేషధారులుగదమ్మా ॥
యిచటనుండు నాదుమాత - పోదునమ్మ - జనకజాతే ॥
తెలివినుండుభూమిసుత - కపటమాను - లోకమాత -
తెలివితోనుండుము పోయెదసీతా -
తెలివిలోనుండిటు - సెలవిదుమాతా ॥ఇ॥

సీత— 28 ఆనందభైరవిరాగము—ఏకతాళము

నాప్రాణనాథు కావనమున - నగసిబ్రోవవే
నాప్రార్థనవంబు లాలకించి - నన్ను గావవే
హే! నిరామయ - నిరంజన - నిష్కళంక

హానిరాకుండ - నావిభు నరయుమయ్యా
మునిచంద్రు చంద్రునింక - మీరారు - కనియు గావరే
జగమువెలిగించు హే - సూర్యచంద్రులారా
దిగులుమాన్పి నన్ - బ్రోవరయ్యా - దిక్పాలులారా
యీ రామ రామచంద్రు నింక - యిపుడె జూపరే॥

రాముడు— 29 బాగువ—ఏకతాళం.

క్షితిసుత నీనుబాసి - ధృతమతి యెట్లుందు
హితమతి సీతా - సతీమణీ నేతా
పతితపావని సీతనెందు - పరగనెచట నేనుగందు
అతివపలుకు లెప్పుడువిందు - హాయి నా కెపుడుకెందు
హే! పరాత్పరా - కరుణాకరా - కావవేరా
సతతముగొల్తుము - సత్యమునమ్ముము
హితవుగ - నీదయ - నిప్పుడుజూపుము
ఓ! శాత్రవభంజన - సజ్జనరంజన
సత్వరకృపగను - మింకన్॥ క్షితి॥

రాముడు— 30 ముఖారి—ఏకతాళము.

పోయెనుగద హా! ప్రాణకాంత బాసి రాముని॥ పో॥
హా! సురలారా! హా! గిరులారా! హా! తరులారా - యరసిరె
సీతన్॥ పో॥
దండకాటవిలోనే - దరుణిని కోల్పోతి
అండజయాస ని - న్నరయుట సున్నా॥ పో॥
ఎక్కడసీతా - ఏది భూజాత
చిక్కదునాకిక - క్షితిసుత సీత॥ పో॥

సుగ్రీవుడు— 31 ఇంగ్లీషునోటు - ఏకతాళము

కనుమా - జనుమా - హనుమా - వినుమా
వారలెవ్వరో - వచ్చుట - యేలొకో॥ గను॥
వాలిపనుపగా - వచ్చినవారని
జాల నమ్మితిని - సందియమేలా॥ గను॥
విల్లు నమ్ములను - గొల్లగచేకొని
చల్లగవచ్చెడి - సరసులరీతిన్॥ గను॥
మౌనివేషములు - పూనియువారలు
దాన మోసమును - దప్పక సలుపన్॥ గ॥

సుగ్రీవుడు—  32 హిం॥ తోడి—ఏక.

కులకాంతను - బలిమినిగొని - చులకనగను - ననుగనివడి - వలదం
చును - కిష్కింధలో - వాలిసన్నుఁ - బారదోలె॥ కుల॥
భయమందియు - కయమందున - బ్రతుకుచుంటి - నగములందు -
కావుమింక - రామచంద్ర - కరుణానంద్ర - సుజనచంద్ర॥ కుల॥

రాముడు—  33 ఇంగ్లీషునోటు—ఏక.

రామునియానతి - రవిసుత మీరియు
భూమిపై బలిష్ఠికవ - పురుషులుయుండిరే॥ రా॥
రాజ్యము చేకూర - రమణిని జేపట్టి
వ్యాజముచేసియు - వెళ్లియొమరచి తో
బుద్ధినిల్పుడ లేదా - యుద్ధమునందున
సిద్ధము దుమించెద - స్థిరబుది వాలిగ
రమ్మింక సేనలతో - రయమున రాకున్న
వమ్ముగ రాముండు - వాడియు జూపియు -
దండించు - ఖండించు - వండించు - నిన్నింక॥ రా॥

వానరులందరు—  34 డైలాగ్.

గజ— శతయోజనములు నేనుౘ - విదితంబుగ సంద్రముదాటౘ -
మదిధైర్యము చెడియుౘ - విను - పదియేగెద ఫలమేమట -
భీషణ మదినాకుౘ -

గవా— యిరువది - రెూ - జనములునే - పరుగున బో - యెదపైనౘ -
గలదని నేనుౘ - గట్టిగజెప్పౘ - అవలఁబోవౘ - అసమర్థుండౘ -

సుషే— దెబ్బకు బోయెద - దెబ్బది యామడ
అబ్బబ్బావల - అది నా వశమా
జనకజవార్తల్ - మనకెటుదెలియుౘ -
ఘన సంద్రంబుౘ - గడువం జాలౘ -

అంగ— పలుకు లికేలా - బలుకగ జాలా-జలనిధిదాటౘ - జాలకననాకుౘ -
బలిమిౘ - మరలౘ - బహుకష్టంబొ॥
వినదౘ - జనెదౘ - కనెదౘ - సెలవిడవే - నిలువకవే - జలనిధి
నేౘ - జాలకనగౘ - గలచెదనేౘ - కలగకుమీ
యలగకుమీ - అ హా హా హా॥

ఆంజనేయులు—  35 హిం. ఏకతాళము.

ఏగువాడనిక - జాగుసేయకను - సూర్యచంద్రు లిలసుడివడగాౘ
సుడివడగాౘ - ఛడియకనేౘ॥ యే॥

గిరులు తరులు భువి - జలధులెల్లమరి - పుడమి నభంబులు భోరనగా
దిక్కుల్ - పెక్కుగ - పిక్కటిలగ - ||యే||
ధాటిగ వార్నిధి దాటితివేగగ - ధరణిజ నచ్చట దర్శింపగ -
జట్టుగవచ్చిన - రక్కసిగుట్టల - బట్టెద - గొట్టెద - మట్టును-
బెట్టెద -
కనియు పుడమిపై - వినియు నెరుంగని - వింతల జేసెద వేడుకగాగ-
చనగగ -సెలవిడు-హనుమని గనివిని-హాయ్ హాయ్ యనగా || యే||

ఆంజనేయులు— 36 ధన్యాశి రూపకరాగము.
ఎందు డాగియున్నావో - నీవెందు డాగియున్నావో||
భూమిజాత లోకమాత ||యెం||
రామునసతివి - సుగుణమతివి - సుజనహితవి - పరమసతివి ||యెం||
తిరిగి తిరిగి వేసరిలితి - పురములన్ని సందులన్ని - దురితహారిని
కరుణ కరుని - యిడుమలు బడుమని - యడవిని ||యెం||
వాడవాడ లన్నిగనితి - మేడలన్ని - తిరిగిజూచితి - వేడివేయుపు-
వంశపావని -మనవిని- తనయుడు గనుపడు ||యెందు||

ఆంజనేయులు— 37 హిందూస్తాని ముఖారి-ఏకతాళము.
కనుపడదా...యనె. హా! సీతా! లోకమాతా ||క ||
యినకులచంద్రుడౌ...శ్రీ...రామచంద్రునీ సతి ||క ||
యేమని చెప్పుదు - రామునితోనిక - నెట్టులుపోవు - దువారల
గాంచగ హా! దైవమా ||క ||

రావణాసురుడు— 38 డైలాగు.
బాలరోయీలా - బలుకగనేలా - భావ్యమా నీకు -
పంతముగోలా - బలిమిగ - జలిమిగ - లలనగ -
విడువకనే - జడియకనే - పుడమిజనే - గలిసెదగా -
వినెదవుగా - విపులముగా - అహాహా ||బాల||

మండో— ఏమిదినాథా - వినవిదివాదా - యేమికీడువడిచేరునోగాదా- బలిమిగ
జెలియగ - గలియగ శుభమగునే - వలదనినే - యడిగితినే - పోద
గదే - వలపునిదే - నిలుపగదే చాల్ చాల్ చాల్ ||యే||

39 డైలాగు.
మండోదరి— విను విను వినునీ - విషయముమరువుము
చనకు చనకు - భూజాతదెసగ
విను విను విను నీ - విషయముదలపకు
రామచరిత్రా - సరసులమిత్రా ||విను||

రావ— చాలునులెమ్మా - సఖివిగశొమ్మా -
సరిసరిపొమ్మా - సఖివినసుమ్మా -
యేలయిట్లుగను - చేలరీతిగను -
జాలినొందెదవు - సరగునబొమ్మా ॥చాలును॥

మండో— చారుచరిత్రా - సరసిజనేత్రా -
సురవరజైత్రా - నిరుపమగాత్రా
యేలచూచెదవు - కూళసీతనిల -
లేరసీకుయిలు - రమణులునాథా ॥నిన॥

40 ఫీలు.

సీత— హా! ప్రాణనాథా!
పాపువిధి యిట్టి - పాటులజేసెనే
కో, పా, మా, నా, యెడ - ప్రాపుకుజేర్చవా? ॥హా॥
రావణు మోసము - రామ నిన్ను బాపె
ఘో, రా, దుః ఖమల్ - కుడుచుచునుంటి ॥హా॥

41 డైలాగు.

ఆంజ— మానినీమణీ - నెందుగాంతు - కాననసీమా
మానవతిరో - గానరావా - కాననసీమా
సీత— రామచంద్రు - గాంచగలనా - రహినినేసిక
శ్యామగాత్రా - ప్రాణకాంతా - శత్రుపీడితో
ఆంజ— లంకలో - రమణీనీవే - వంకనుండితో
పంకజాక్షీ - కానరావా - కాననసీమా
సీత— లంకలోన - నెట్లుమనుట - జంకకుండనే
నింకమనుట - కల్లపుడమి - పంకజాస్య! హా!
ఆంజ— రక్కసులు - మిన్నింగిరేమొ - రమణీనక్కటా
సీతా— చక్కనీనా - ప్రాణనాథ - సఖినిగాంచవా

రావ— 42. హిం. తోడి—ఏకతాళము.
కల్కిమిటారి - కంతునికటారి ॥ క॥
పల్కవేమినాతో - చిల్కలకొల్కి ॥ క॥
చేడరో భాగ్యంబు - చేకూర్తునీకిప్డే
వేడెద నన్నూడవే - వేగమెసన్నావవే ॥ క॥
శౌర్యధైర్యనిధిని - చేపట్టి నన్నేలవే
నీ కోరికలు దీర్తునే - కోమలి నన్నూడవే, ॥ క॥

హా! సీతనస్జూను - నారాజ్య మిచ్చెదనే .
నా ప్రాణమనియెంతునే - నాయాంఘ్రి నాసీల్ గదే॥క॥

సీత— 43 హిం॥తోడి—ఏక.

ఫో, ఫో, ఫో, ఛీ, క్రూరుడా - ఫో, నీచభావ॥ ఫో॥
దశరధరాముడు - ధరణీజకాముడు
నిన్నాజదుర్మించురనేడు - నా ప్రాణేశు కోపాగ్నిజూడు - క్రూళపల్కు
విడుము - కూడదువేజనుము॥ ఫో॥
వినువినుచోరా - ఓరీక్రూరా - మదరాపోరా - గనుసీగతిరా॥ఫో॥

రావ— యెంత దానవెరామ - ఓ నాదుభామ॥ యెం॥
నిన్ను నేవిడసున్న - లేవే భూమిజచన్న॥ యెంత॥
సరసమాచాలా-సకగుణశీలా - సణగకుగోలా - నన్విడమేలా॥ యెం॥

ఏకజట— 44 హిం॥తోడి—ఆదితాళము

చింతామానుమిక - పాపిసీ - సీత-వంతానొందకుము-మానిసీ ॥చిం॥
చూడుచూడునాతీ - వేకు ఓ దుష్టామతీ
చంపానెంచితిమిగోతి - నిను - చంపానెంచితిమి గోతి
క్రూరమతి - యేమిగతి - రాముసతి - ఓసీసీత॥ చిం॥

ఏకజట— 46 హిం॥ తోడి—ఏకతాళం

కోరిచేరు మాదురాజును మది - కొరతలేదు
నికగొంకకు॥ కో॥
వినువినులేవే - మననికరావే - శయ్యాజేరనిక-జనవే-విరి - శయ్యా
జేరనిక కనవే॥కో॥
జాలమేల - మీరెవేళ - ఓసిబాల - రావణులోలా॥కో॥

ఆంజ— 46 హిం॥ తోడి—ఏకతాళము

రా, రా, రా, రా, రమణీమణిరొనిను-రామునిసన్నిధి జేర్చెదనే॥రా॥
నారీమణిరో - వారిజాక్షిరో -
సరసిజానన - మరళగమన - సమ్మతమిదియె - జనకజా॥రా॥

47 డైలాగు

ఆంజ— రా, రా, రా, రా, రణముననిను - దునిమెద - రక్కసి-వేగముగ-
దురంబునను నిక - విరోధమునసే - హరించెదర గనుత్వరగనునేర

అక్ష— రా, రా, పోరర

ఆంజ— జాలా మేలా

అక్ష— ఆలము సేయగ - జాలమదేలను - జాలమువీడియు, సరగున రా

ఆంజ— బాలకచాలవు - ఆలమునందున - కాలునిజూడగ కాలమువచ్చెను

అక్క— తులువా, పలువా, పొగరడతుఁ

ఆంజ— పలుకుల్ - బలుకఁ - జులుకనరే

అక్క— రా, రా, తుంచితుఁ

ఆంజ— లేరా చూతుఁ

అక్క— కదనంబు సేయగ చాలవుపో

ఆంజ— వదరకు నీవింక పొగరడతుఁ

ఇంద్రజిత్తు— 48 బేహాగ్—ఏకతాళము.

సేవకా - విల్లునమ్ములను - నిల్లిమ్మా

బ్రహ్మబాణమును - గానిరమ్మా॥ సే॥

శిరమును దుంచెద - శరమునుబూని - సరగునతెమ్మిక - సభికులు

జూడఁ దుంచెద వీనిని తే తెమ్మా॥ సె॥

వీని దుంచెద నేనిక తే తెమ్మా॥ సే॥

ఒడలను జీల్చియు-పుడమినివైచెద-జడియక నిల్వుము - జగడమునన్

రూపును మాపెద-రారమ్మా-నీవులేవిక గూల్చెద-రారమ్మా॥ సే॥

రాముడు— 49 ముఖారి.

సోదరా! గతించితే యెవరునాకు దిక్కులా?

ఎవరు నాకు దిక్కులా? ఇంకెవరునాకు దిక్కులా?॥ సో॥

నీకు పూర్ణాయువు - నీగజాతకు డాసగడనుచు

పాకటముగ నెవ్వరైన - బల్కరైరిగా॥ సో॥

నీదుమాత భార్యలకు - నేమనంచు దెల్పువాడ

మోదమెసగ నిన్నుబోలు - సాధులున్న యాధరఁ॥సో॥

రాముడు— 50 ఇంగ్లీషునోటు—ఏకతాళము

ఏరా - కూరా - మేరా - తీరా

తెగవేయుటనిఁ - దెలియవుగా॥ఏరా॥

ఖర కర నిన్నుఁ - ఖండించెద నే॥ ఏ॥

జ్ఞాతి వైరమును - జూపుచునీవుఁ

నీతి దప్పియుద - యుంచితివౌరా॥ ఏ॥

నీదుమేను వే - తునియలుగాగఁ

జేయు కనుమిదె - శ్రీరాముఁ॥ఏ॥

రావణుడు— ఇంగ్లీషునోటు-ఏకతాళము

నిలుమిందుపోక - గను నాదు రాక

సురల్ వంగి రాగ - నరుల్ బారి పోగ

రణాశూరు డంచుఁ - మది నెంచకఁ - వచ్చితి

మేదిని - గుర్రంగగ - మేరువు - కూలగ - శేతునేను॥ని॥
ఈశుడా - దయా - కేశుడా - యి కెవ్వడొచ్చినా
గాంచి - హరించి - మించి - సంచరించు - పో-రావణుండు నీ
వినక - వినక -నిలిచి - యున్న - జంపివైతుగా॥ నిలు॥

రావణుడు— 52 యింగ్లీషునోటు—ఏకతాళము.

బాహుబలముగాంచు - మీా - రణంబు నందునీ
న్రించెదన - దుంచెదన - యింక నీవు - లేవురాముడా
ఓ-కీ-పో

రాముడు— రణమున నిను నరికిగాంచెదన - గాంచెదన - గాంచెదన
కోపముదీరన - కోరికలారన-కష్టము - గజపతి - కడతేరన
దురమునందు దుంచెదన - బ్రతుక లేవురావణా॥
ఓ-కీ-పో

రావ— చులకనపలుకులు - పలుకకరారా
రాము— కలనను నిలువుము - కడతేర్తున్
రావ— జాలమేలరారా
రాము— వేళవచ్చెరేరా
రావ— వినరా
రాము— మనరా

రాముడు— 53 సావేరిరాగము—ఏకతాళము.

ఆనందమాయెగా ॥ అనుజా ॥ లోకమంత ॥ఆ॥
దుష్టరక్కసీ రావణువధచే ॥ కష్టమెల్లను గట్టునుబట్టె ॥ఆ॥
అనుజునిమనమున - గనుగొ నిలంకకు - ఘనముగురా
జుగగలుగ విభీషణు - డా, నం, ద, మాయె ॥

సీత— 54 పూరీకల్యాణి—ఏకతాళము.

కావవే - బ్రోవవే - కనికరమున నాధనన ॥కావ॥
లంకలోనసంకటములు - రామనేను బడితిచాల ॥కా॥
నీదుపాద నీరజముల ॥ నిక్కముగను గొల్చుచుంటి ॥కా॥
రామా - జానకీరామా - రక్కసిజితభీమా - సుగుణశ్యామా ॥కా

రాము 55 ఇంగ్లీషునోటు—ఏకతాళము.

అంటరాకు - వలదునాకు - తుంట - ఛీ. ఛీ. పో ॥అం॥
రక్కసీడు గొనినన్ను రాముడెట్లు గొనును మరల ॥అం-॥

సీత — 56 ముఖారి—ఏకతాళము.

కా - వా - రా - వే
దోషవి - హీనవే - దోసిలొగ్గితి
ఈసరిపిరలు - వాసిగజూడవే ||కా||
పావకనీవునా - ప్రార్థనలాలించి
బ్రోవవే నీవిక - భూమిజదయచే ||కా||

సమాప్తం

